పశువైద్య గ్రంథమాల 2 వ పుష్పము

# ద్రవ్యజ్ఞానము

గ్రంథకర్త:

"అభినవ సహదేవ" ఆయుర్వేద పశువైద్యాచార్య, వైద్యకళా విభూషణ, పశువైద్యగ్రంథమాల, ఆయుర్వేద పశుచికిత్సా లయ సంస్థాపకులు, ఆంధ్ర జాతీయ పశువైద్య విద్యాపీఠ ప్రెసిడెంటు, ఆంధ్ర జాతీయ పశువైద్య కళాశాలప్రిన్సిపాల్ నగు,

డాక్టర్ యేజెళ్ల శ్రీరాములు చౌదరి,

A. V. L. M. & S., A. M. B. & B.S.

అంగలూరు, కృష్ణాజిల్లా.



1937

 [వెల రు 1-0-0.

iv



గ్రంథకర్త:
"అభినవసహదేవ"
యేజెళ్ల శ్రీరాములుచౌదరి

# విజ్ఞప్తి

నేను సుమారు పదిసంవత్సరములక్రిందట ఆయుర్వేద పశుచికిత్సాలయమును ఆయుర్వేద పశువైద్య గ్రంథమాలను స్థాపించి అనుభవపూర్వకముగా నప్పుడప్పుడు పశువైద్య గ్రంథముల బ్రికటించుచు వార్తాపత్రికలలో వ్యాసములువ్రాయుచు నా శక్తికొలది పశుసేవ చేయుచున్నసంగతి తామెల్లరకును దెలిసియేయున్నది. నేను వ్రాసిన గ్రంథములనుబట్టియు, నా యొద్ద తరిబియతయిన వైద్యులద్వారాను, కరపత్రముల మూలకముగను ఆంధ్రదేశమందంతటను అయుర్వేద పశువైద్యమును వ్యాపింపజేసితిని.

మరియొక ముఖ్యవిషయమేమన నే నిప్పు డొక ఆంధ్రజాతీయ పశువైద్య కళాశాలను స్థాపించి గవర్నమెంటువారిచే రిజిష్టరు చేయించి యనేకమంది పశువైద్యులను తరిబియతు చేయుచున్నాడను. ఈకళాశాల ప్రభుత్వమువారివలన త్వరలో రికగ్నైజు కానున్నది.

ప్రస్తుత కాలపరిస్థితులనుబట్టి రైతులకును విద్యార్థులకును తదితరులకును అర్థమగునటుల సులభశైలియందు ఇరువది పశువైద్య గ్రంథములను మాపశువైద్య గ్రంథమాలతరపున బ్రికటించితిని. మా యాయుర్వేద పశువైద్య గ్రంథమాలయందు వెల్వడిన గ్రంథరాజములం దిదియు నొక్కటి. ఇయ్యది

పశుధనాభిమానులగు హైందవులకెల్ల రకును హ స్తభూషణమని చెప్పనగును.

మా యీగ్రంథములపై గవర్నమెంటు వెటరినరీ, అగ్రికల్చరల్, రెవిన్యూ, ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటులయందలి ప్రముఖులగు నుద్యోగులును తదితర డిపార్టుమెంటులవారును జమీందారులు భూస్వాములు మున్నగు వారు పెక్కురు పెక్కు సదభిప్రాయముల నొసంగియున్నారలు.

మా యీ గ్రంథముల నాంధ్రలోకమాదరించి ప్రతి పాఠశాలయందును, ప్రతిపుస్తక భాండాగారమందును, కోఆపరేటివు సొసైటీలయందును ఉంచి మాపశువైద్య గ్రంథమాల నభివృద్ధికి దెత్తురని విశ్వసించుచున్నారము.

ఈ గ్రంథమునకు దయతో పీఠిక వ్రాసి వన్నెదెచ్చిన పశుధనాభిమాన శిరోమణికిని ముద్దులొలుకునటు లీ గ్రంథమును త్వరలో ముద్రింపించి యిచ్చిన గ్రంథాలయప్రెస్సు మానేజరు శ్రీ కుందా లక్ష్మీనరసయ్యగారికిని, నా యీ గ్రంథ రచనమునకు సాయపడిన గ్రంథముల రచయితలకును నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాడను.

ఇట్లు,

గ్రంథకర్త.





## అడ్డసరము (Adhatoda Vasica)

శ్లో॥ ఆరూశా వాసకో వాసా వృషా సింహముఖీ భిషక్,
సింహపర్ణీ వృషో వాసా సింహకో త్పాటరూషకః.

టీ॥ ఆరూశా-వాసకః-వాసా-వృషా-సింహముఖీ-భిషక్,
సింహపర్ణీ-వృషా-వాసా-సింహకా-ఉత్పాటరూపకః.

అనునవి అడ్డసరము నామములు

ఇదియొక గుల్మజాతివృక్షము. దీని రెమ్మలు ఒకదాని ప్రక్క నొకటి మొలచి పొదలవలె పెరుగును. దీనికొమ్మలు లేతగనున్నపుడు ఆకుపచ్చగను, ముదిరినపుడు తెలుపుగను ఉండును. దీని ఆకులు మామిడాకులవలె పొడవుగనుండును, గాని పెళుసుగనుండవు. పండుటాకులు పసుపుపచ్చగనుండును. మాఘఫాల్గుణమాసములలో నిది పూతపూయును. అప్పుడు కొమ్మలచివర జూలువలె చిన్నచిన్నకోటియాకులు పుట్టి వానిలో తెల్లని చిన్నపువ్వులుపూయును. కాయలుకాయదు. దీనివేరు, ఆకులు, పువ్వులు ఔషధములలో వాడుదురు. ఆయుర్వేదపశువైద్యులు దీని ఆకులను చెక్కను వాతరోగములకు వాడుదురు. ఆకురసము విరేచనముల కట్టించును. వాతముల

నన్నింటిని పోగొట్టును. పశువులకు కలుగు శ్వాససంబంధమగు రోగములకు చెక్కరసము, ఆకురసము బాగుగా పనిచేయును. ముద్దవాతము వచ్చినపుడు రెండుగుప్పెళ్ల ఆకులను గుండజేసి దానిలో ఒకతులం ఇంగువ, రెండుతులములు ఉప్పుకలిపి పెట్టిన తగ్గును. ఆకురసము తేనెతోకలిపి దగ్గులకు, వగర్పునకు అప్పుడప్పుడు నాలుకకు నాకించిన తగ్గును. దీని ఆకుపసరు చలువ చేయును. దీని ఆకులు చెక్కను కషాయముగా కాచి పశువులకు వచ్చు కల్లవాపులు, వాతనొప్పులు, దెబ్బలకు వాడిన బాగుగా పనిచేయును.

మోతాదు:—ఆకులు - 10 తులములవరకు.

## —♦ అవిసె (Linseed plant) ♦—

శ్లో॥ అగస్త్యో వంగసేనాహ్వో మధుశిగ్రు ర్మునిద్రుమః.

టీ॥ అగ_స్త్యః-వంగసేనాహ్వః-మధుశిగ్రుః-మునిద్రుమః-అనునవి అవిసిపేర్లు.

ఇది ప్రసిద్ధమైన పెద్దచెట్టు. దీనిపువ్వులు పెద్దవిగా నుండి ఎరుపురంగుగగాని, తెలుపురంగుగగాని ఉండును. కొందరు ఆకులను పువ్వులను వాడుదురు. దీని చెక్కరసము, ఆకురసము చేదుగనుండును. వేడిజేయును. పైత్యపుదద్దురునకు ఆకుపసరు పశువుశరీరమున కంతటికి రెండుమూడు పర్యాయములు పట్టించినయెడల బాగుగా పనిచేయును. ఇంకను వాతనొప్పులకు, ఉబ్బురోగమునకుకూడ ఈపసరును శరీరమునకు పూయవచ్చును. నేత్రరోగములకు ఆకుపసరుతో మిరియాలు

గాని, శొంఠిగాని గంధముతీసి కలిపి వాడిన బాగుగా పని చేయును. చర్మరోగములకు ఆకుపసరులో తగినంత ముద్ద కర్పూరము కలిపి వాడిన పనిచేయును.

### —♦ అవిసె గింజలు (Linseeds) ♦—

మూత్రరోగములకును, రక్తసంబంధమగు రోగముల కును ఈగింజలను జావగా కాచి పథ్యముగా పెట్టవచ్చును. ఇం కను గింజలను పిండిగావిసరి కంతులకు, వాపులకు, నెత్తురుగడ్డ లకు వేసికట్టినచో పక్వమునకువచ్చును. దూడలను బలపరచు వారు ఈగింజలను కొంతకాలమువరకు మేతతో చేర్చిపెట్టు చుండినయెడల అవి కండబట్టి బలియును.

### —♦ అవిసెనూనె (Linseed oil) ♦—

ఇంగ్లీషుమందుల షాపులలోదొరకు అవిసెనూనెను కడు పుబ్బులకు వాడినయెడల బాగుగా పనిచేయును. అవిసె నూనెను శరీరమంటలకు, వాపులకు, విరేచనములు కలిగించు టకు, దీర్ఘకడుపుబ్బులకు బాగుగా వాడవచ్చును.

మోతాదు:—సవాసేరునుంచి అరవీసెవరకు.

### —♦ అల్లము (Ginger) ♦—

శ్లో॥ ఆర్ద్రికం శృంగిబేరం తన్మహౌషధ ముదాహృతం.
టీ॥ ఆర్ద్రికం-,శృంగిబేరం-మహౌషధం - అనునవి అల్లపుపేర్లు.

ఇది పసుపు మొదలైన మొక్కలజాతిలో చేరినది. అల్లమునుండియే శొంఠిని తయారుచేయుదురు. మనకు చీనా, జపాను దేశములనుండికూడ వచ్చుచున్నది. అల్లము కార

ముగా, పుల్లగానుండును. వేడిజేయును, జీర్ణశ్వాస సంబంధమగు రోగములకన్నిటికి బాగుగాపనిజేయును. కడుపులోని వాయువును హరింపజేయును. అజీర్తి, దగ్గు, వగర్పుమున్నగు రోగములలో మంచిబెల్లము, అల్లము సమానభాగములు తీసికొని నారింజకాయంత ప్రతిపూట పెట్టుచుండినయెడల బాగుగా పనిజేయును.

మోతాదు:—1 తు మొదలు సేరువరకు.

## —♦ అరటి (Plantain tree) ♦—

శ్లో॥ కదళీ గ్రింధినీ మోచా రంభా వీరా యతచ్ఛదా,
కదళీవారణబుసా రంభా మోచా మహత్ఫలా.

టీ॥ కదళీ-గ్రింధనీ - మోచా - రంభా-వీరా - ఆయతచ్ఛదా,
వారణబుసా-రంభా-మహత్ఫలా అనునవి అరటిపేర్లు.

వీనిలో అనేక రకములుగలవు వీని దుంప, వేర్లు, పొత్తి, ఆకులు, మున్నగువాని రసము స్వాదుగవెగటుగనుండును. చలువచేయును. దుంపరసము రక్తసంబంధమగు రోగములకు బాగుగాపనిచేయును. వేర్ళరసము విషములను విరచును. ఆకురసము, దుంపరసము నేత్రవ్యాధులకు పనిజేయును. ఆకుల చూర్ణము వెన్నతోకలిపి అరుగ్రవాపులకు, చర్మవ్యాధులకు ఉపయోగించిన బాగుగాపనిజేయును. అరటిపండ్లను మలబద్ధకముగా నుండుదూడలకు, ఎండురోగముగల పశువులకు పెట్టిన బాగుగాపనిజేయును. దుంపరసము విరేచనముల కట్టించును. అరటిపువ్వులరసములో కవిరికలిపి యిచ్చిన

పారుదురోగము కట్టును. ఆకురసమును నేత్రరోగములకు వాడవచ్చును.

మోతాదు:—దుంపరసము అర్ధసేరువరకు.

## —♦ అతిమధురము (Liquorice root) ♦—

శ్లో॥ మధుయష్టీ క్లీతనకం యష్టీ మధు మధూలికా,
యష్ట్యాహ్వం మధుకం యష్టీమధూకం జలజామధు.

టీ॥ మధుయష్టీ-క్లీతనకం-యష్టీమధు-మధూలికా,
యష్టీ- మధుకం- యష్టిమధూకం - జలజా -మధు -అనునవి
అతిమధురము పేర్లు.

ఈ మొక్కలు పెషావరు అరేబియా సింధుప్రాంతము లందు పైరగును. ఇది ఆరడుగులఎత్తు పెరుగును. ఆకు గుండ్రముగ, చిన్నదిగ, ములగఆకంత పరిమాణముగ నుండును. చెట్టంతయు నారగానుండును. సన్నని గుత్తులుగా పూవులు పూచును. పువ్వులకు వాసనయుండదు. ఆకును నలిపిన వెగటు వాసనగానుండును. సన్యాసులు దీనిఆకు తిని యోగసిద్ధివడయుదురు. వేరురసము చలువచేయును. నేత్రరోగములకు, చర్మవ్యాధులకు బాగుగాపనిచేయును. యష్టిమధుకమును దగ్గులకు, వగర్పునకు వాడవచ్చును. దీని బెరడు ముందు చేదుగనుండి తదుపరి తీపిగనుండును. బెరడు పొడితో తగినంత బెల్లముకలిపి దగ్గులకు నాకించవచ్చును.

మోతాదు:—2 తులములవరకు.

## —♦ అక్కలకర్ర (Pellitory Root) ♦—

ఇది గుల్మముగ పెరుగును. చామంతి ఆకువంటి ఆకులను, బోడతరపుపువ్వువంటి కాయయును కలిగియుండును. కాయ అంతయు పసుపుపచ్చగను, పైన ఎరుపురంగుగల బెరడును యుండును. దీని పూతలోనే గింజలుండును. దీనివేరునే అక్కల కర్రయందురు. ఆకుకూడ వేరువలెనే నమిలినయెడల చిమ చిమ లాడును. ఇది వగరుగ కారముగనుండును. వేడిజేయును. నరసంబంధమగు రోగములకు ఈరసము బాగుగాపనిచేయును. వాతరోగముల పోగొట్టును. గట్టికంతులకు గండఫెరోజాలో ఈ అక్కలకర్ర పొడికలిపి పట్టీవేసిన త్వరలో పక్వమునకు వచ్చును. నేత్రరోగములకు దీనిని తదితర ఔషధములతో కలిపి వాడవచ్చును. జోరీగలు, కందిరీగలు పశువుశరీరమును కరచి దద్దురు పుట్టినయెడల నాముసుద్దతో ఈ అక్కలకర్ర గంధముతీసి కలిపిరాసిన తగ్గును.

మోతాదు:—2 తులములవరకు.

## —♦ అత్తి (Ficus Racemosa) ♦—

శ్లో॥ ఉదుంబరః క్షీరవృక్షో జంతువృక్ష స్సదాఫలః,
హేమదుగ్ధః కృమిఫలో యజ్ఞాంగ శ్శీతవల్కలః.

టీ॥ ఉదుంబరః-క్షీరవృక్షః-జంతువృక్షః-సదాఫలః,
హేమదుగ్ధః-కృమిఫలః-యజ్ఞాంగః-శీతవల్కలః.

అనునవి మేడిపేరులు.

ఇది పెద్దవృక్షము. ఆకులు గుండ్రముగ, కొంచెము కోలగ మందముగ గరగరలాడుచుండును. చెట్టునుండి పాలు గారును. కాయలు గుండ్రముగ తీయగనుండును. వీటినే అత్తిపండ్లందురు. ఇవి పూవులు పూయకయే కాయలు పుట్టును. చెక్కరసము వెగటుగ తీపిగనుండును. వాతరోగము లకు చెక్కరసము బాగుగా పనిచేయును. చెక్కపొడి కంతు లకు చర్మరోగములకు వేపనూనెలో కలిపి రాసిన పనిచేయును. అత్తిపండ్లను పిసికి మొండికంతులపై న వేసినయెడల పక్వము నకు వచ్చును.

మోతాదు:—చెక్కరసము సేరువరకు.

—♦ అతివస(Root of Indian Atees) ♦—

శ్లో॥ అతివిషా శుక్లకందా విషా ప్రతివిషాపరా,
శ్యామకందా సితాశృంగీ భంగు రోపవిషాణికా.

టీ॥ అతివిషా-శుక్లకందా-విషా- ప్రతివిషా అనునవి అతివస నామములు. శ్యామకందా-శృంగీ-భంగురా - ఉపవిషాణికా అనునవి నల్లఅతివస నామములు.

ఈఅతివస తెలుపు, నలుపు, ఎరుపు అని మూడువిధ ములుగానుండును. కాని గుణముమాత్రము సమముగానుం డును. అతివస కొంచెము చిరుచేదుగ, కారముగనుండును. దీనిగంధము కళ్లవాపులకు పనిచేయును. దూడలకు కలుగు పాలదొమ్మలలో దీనిని వాడవచ్చును.

మోతాదు:—తులమువరకు.

—♦ అడవి జీలకఱ్ఱ (Wild Cummin seeds) ♦—

దీనినే విషకంటకాలు అందురు. ఆకుపైన నూగుండును. దీనినే నల్లజీలకర్ర చేదుజీలకర్ర యందురు. ఈపొడి విరేచనముల గావించును. కడుపునొప్పి, కడుపుబ్బు మొదలగు జీర్ణ సంబంధమగు రోగములకు వాడిన బాగుగా పనిచేయును. వాయువును హరింపజేయును. మిక్కిలి చేదుగనుండును. వేడిజేయును.

మోతాదు:—4 తులములవరకు.

—♦ ఆముదపుచెట్టు (Ricinis Communius) ♦—

ఈచెట్టు చాలప్రసిద్ధమైనది. ఇది చిట్టాముదము, పెద్దాముదము అని రెండుజాతులు. చిట్టాముదమునకు కాయలు ఆకులు చిన్నవిగాను, పెద్దాముదమునకు పెద్దవిగానుయుండును. గుణము సమానమే, కాని చిట్టాముదముమంచిది. వీనిలో పూవులలో ఎరుపు, తెలుపుభేదములుగలవు. ఆకులు వగరుగ చేదుగ, రుచిగనుండును. తలమాదకు, శిరోవాతములకు ఆకులను వేసికట్టిన బాగుగా పనిచేయును. శిలామేహపాతమునకు ఆకురసము వాడవచ్చును. ఆముదపువేరు వాతరోగములకు నుపయోగించవచ్చును. ఆముదపుగింజలు విరేచనముగావించును. మామూలుగాపెట్టు దాణా దినుసులు మొదలగు బలవర్ధకౌషధములలో ఆముదపుపప్పును వేసిపెట్టుచుండిన యెడల వాతరోగములు, నేత్రరోగములు సంభవింపవు. ఆముదము విరేచనమును గలిగించును

మోతాదు:—ఆముదము సేరువరకు



# ద్రవ్యజ్ఞానము

## —♦ ఆవాలు (Indian mustard) ♦—

శ్లో॥ సర్షపఃకటుకస్నేహో భూతఘ్నో రక్షితాఫలః,
తుర్తుభోన్యస్సు ఉదిష్టస్సిద్ధార్థశ్శ్వేతసర్షపః,
రాజికాచాసురీరాజీ సుతీక్ష్ణః కృష్ణసర్షపః.

టీ॥ సర్షపః-కటుకస్నేహః-భూతఘ్నః-రక్షితాఫలః,
అనునవి ఆవాలపేర్లు
తుర్తుభః-సిద్ధార్థః-శ్వేతసర్షపః - అనునవి తెల్ల ఆవాలపేర్లు
రాజికా-ఆసురీరాజీ-సుతీక్ష్ణః- కృష్ణసర్షపః - నల్లఆవాలపేర్లు

ఆవాలలో ఎరుపు తెలుపు నలుపురంగులుగలవు. ఇంచుమించుగ మూడును సమానగుణములు గలిగియుండును. తెల్లావాలను ఔషధములలో వాడుదురు. వేడిచేయును. వాతరోగములలో విరివిగా వాడవచ్చును. వీనిని తరచుగా జబ్బుపడినభాగమునకు పట్లువేయుదురు. వీనిని పట్టువేయునపుడు వేడినీటితో కలిపి పట్టువేయవలెను. వాచియుండు ప్రదేశముపైన ఈపిండితో పట్టువేసిన తగ్గును. పశువునకు న్యూమోనియా మున్నగువ్యాధులు కలిగినపుడు ప్రక్కలమీదను, కడుపునొప్పికి పొట్టమీదను, గుండె, పేగులు వాచినపుడు ఆయా ప్రదేశములమీదను పట్టువేయవలెను. ఇంకను వీటిని బలవర్ధకౌషధములలో కలిపి వాడవచ్చును. చురుకుగా పని చేయును.

మోతాదు:— 1 తులమునుంచి 2 తు. వరకు.

—♦ ఆరుదొండ (Capparis zeilamica) ♦—

శ్లో॥ ఆర్జటస్స్యాదార్త్రగళో బహుకంటః ప్రిఘర్షణః.
టీ॥ ఆర్జటః- ఆర్త్రగళః- బహుకంటః- ప్రిఘర్షణః.
అనునవి ఆరుదొండ పేర్లు.

ఇది తీగ. కాయ కోలగ నుండును. పండిన ఎరుపుగ నుండును. కాయలు చేదుగనుండును. ఈ ఆకుపసరు వేడిజే యును. దీర్ఘవాతములలో వాడవచ్చును. ఈ దొండచిగుళ్ల లో తగినన్ని మిరియాలు, జాజికాయ కలిపి పెట్టిన అతిమూత్రి ముతగ్గును. వాపులకు దీని పసరును వాడవచ్చును.

మోతాదు;— ఆకుపసరు అర్ధశేరు.

—♦ ఆకుజెముడు (Euphorba Nerufola) ♦—

శ్లో॥ దళస్నుహీశ్వానజిహ్వా పత్రిస్నుక్సు విరేచనీ.
టీ॥ దళస్నుహీ-శ్వానజిహ్వా పత్రిస్నుక్ - సువిరేచనీ అనునవి ఆకుజెముడు పేర్లు.

జెముడుచెట్లలో ఆకుజెముడు, ఫుల్లజెముడు, పలకల జెముడు మున్నగు అనేకరకములుగలవు. అన్నిటికి పాలుపుర్తిగానుండును. ఇంచుమించు సమానగుణములు కలిగియుండును. ఆకుజెముడుకు సన్నని కాడలును అరుదుగ చిన్ని ఆకులును యుండును. వేడిజేయును. కఫమును పోగొట్టును. విరేచనము గలిగించును. పశువులకు శ్వాసరోగములందును సంధి పుట్టినపుడును దాని కాడలు దోరగావేయించి రసముతీసి తగినంతగా త్రాగించినయెడల శ్వాసకట్టును. ఇంకను ఈకాడరసములో

వేపనూనెకలిపి అరుగ్రావాపులకు కల్లవాపులకు ఉపయోగించవచ్చును.

మోతాదు:—పసరు అర్ధసేరువరకు.

—♦ ఆడాలు (Arabis Chinensis) ♦—

ఈగింజలు ఎరుపుగ, గుండ్రముగ పెద్ద ఆవాలంత పరిమాణముగనుండును. జీర్ణశక్తిజేయును. వీటిని నూరి చర్మరోగములకు బాగుగా వాడవచ్చును. వాతరోగములలో తదితర మందులలోకలిపి లోపలికి ఈయవచ్చును.

మోతాదు:—3 తులములవరకు.

—♦ ఇంగువ (Assafoetida) ♦—

శ్లో॥ హింగుబాహ్లీకమత్యుగ్రం రామఠం భూతనాశనం,
అగూఢగంధాజరణం జంతుఘ్నం సూపభూషణం.

టీ॥ హింగు-బాహ్లీకం-అత్యుగ్రం-రామఠం-భూతనాశనం
అగూఢగంధా-జరణం-జంతుఘ్నం-సూపభూషణం అనునవి
ఇంగువపేర్లు.

ఇవి 3, 4 అడుగుల ఎత్తువరకు పెరుగును. ఈ మొక్కలలో చాలరకములుగలవు. చెట్టువేళ్ళను నరకుటవలన నేర్పడెడి జిగురు నిలువయుంచుటవలన నలుపురంగుగనుండును. దీనినే ఇంగువయందురు. కొందరు వర్తకులు దీనిపైన రంగుపూయుదురు. ఇది కారువాసనగ, వెగటుగ, కారముగ నుండును. మిక్కిలి వేడిజేసి ఆర్పును. శ్వాసనణచును, విరేచనముగావించును. పశువులకుకలుగు జీర్ణవాత శ్వాసరోగములకు బాగుగా

పనిచేయును. ఈనినవెంటనే 4 తులముల ఇంగువను సేరు పాలలోకలిపి వేడిజేసి త్రాగించిన వాతమును హరించును. ఇంగువను సారాయిలోగాని, స్పిరిట్‌లోగాని కలిపి పుండ్లకు రాసిన నెమ్మదించును. దీర్ఘకడుపుబ్బులకు కర్పూరతైలంలోగాని, అవిసెనూనెలోగాని ఇంగువనుకలిపి త్రాగించిన తగ్గును.

మోతాదు:—4 తులములవరకు.

## —♦ ఇందుపగింజలు (Clearing nuts) ♦—

శ్లో॥ కతకోమ్బుప్రసాదశ్చ ద్రవస్తిక్తఫలస్తథాః.
టీ॥ కతకః-అంబుప్రసాదః-ద్రవః-తిక్తఫలః అనునవిచిల్లగింజపేర్లు

ఈచెట్లు ముసిడిచెట్టుకంటెపెద్దవి. ఇవి కొండలమీాద బాగుగాపెరుగును. పండ్లనుతిందురు. గింజలు జిగటగనుండును. గింజలనరుగదీసి మడ్డిని నీటిలో కలిపినయెడల స్వచ్ఛమైన నీరు పైకితేరును. ఇంకను ఈగింజలను మసిచేసిపంచదారలో కలిపి పశువులకు కలుగు నేత్రరోగముల కుపయోగించవచ్చును.

## —♦ ఇసుక (Sand) ♦—

దీనిని మంగలములో వేయించి తీసి గుడ్డలోగాని, గోనె పట్టాలోగాని వేసివెచ్చవెచ్చనిది పశువులకు కలుగు వాతనొప్పులకు, కణతులకు, బెణుకులకు, తదితర దెబ్బలకు కాచినయెడల వెంటనే సుగుణమిచ్చును. అరుప్రివాపులకు, మిడికి మాత్రము ముందు దొండాకుపసరుతో తగినంతవెన్నకలిపి ఆభాగములకు మర్దనచేసి ఇసుకకాపులు తీసిన తగ్గును.

## —♦ ఇప్ప (Bassia) ♦—

శ్లో॥ మధూకో మధుక స్తీక్ష్ణసారశ్చ గుడపుష్పకః,
గోలాఫలో లోధ్రపుష్పో మధుకోష్ఠో మధుద్రుమః.

టీ॥ మధూకః-మధుకః-తీక్ష్ణసారః-గుడపుష్పకః,
గోలాఫలః-లోధ్రపుష్పః-మధుకోష్ఠః-మధుద్రుమః అనునవి
ఇప్ప పేర్లు.

ఇది పెద్దవృక్షము. దీని ఆకులు లోలుగాకులవలెనుండును. దీని పూవులు పొగడపూవులవలెనుండును. పువ్వులనుండి సారాయితీయుదురు. ఇంకను చమురుగూడ తీయుదురు. ఆముదముకంటె చిక్కగానుండును. పువ్వులను ఎండబెట్టి పిండిగా జేయుదురు. ఇప్పనూనె వేడిజేసి ఆర్చును. ఈచెట్టుబెరడురసము వాతరోగములకు, క్రిమిరోగములకు బాగుగా పనిచేయును. ఇప్పపిండి మోకాళ్లవాపులను తగ్గించును. ఇప్పపువ్వు పెద్దరోగమునకు పనిచేయును.

## —♦ ఇసుళ్లు (Winged white ants) ♦—

వర్షాకాలమునందు చెదలపుట్టలలోనుండి గుంపులు గుంపులుగావచ్చు రెక్కలుగల పెద్దచెదలపురుగులు. ఈ పురుగులరెక్కలుకాల్చి మసి చేసి ఆముదములో కలిపి మెడమీద కలుగు అరుగ్రవాపులకు పుండ్లకువాడిన త్వరలో తగ్గును.

## —♦ ఉత్తరేణి ( Achycanthes Aspera ) ♦—

శ్లో॥ అపామార్గస్తు శిఖరీ కిణిహీ ఖరమంజరీ,
అధశ్శల్యశ్శైఖరికః ప్రత్యక్పుష్పీమయూరకః.

టీ॥ అపామార్గః - శిఖరీ - కిణిహీ - ఖరమంజరీ
అధశ్శల్యః- శైఖరికః- ప్రత్యక్పుష్పీ-మయూరకః అనునవి ఉత్తరేణి పేర్లు.

వీనిలో నలుపు తెలుపు ఎరుపు అను మూడురకములు గలవు. ఉత్తరేణిఆకులు నూరి విరిగిన భాగములకు కట్టుకట్టిన ఎముకలు త్వరలో కట్టుకొనును. ఈ ఆకుపసరు కారముగ చేదుగనుండును. జొన్నకలిలో ఆకుపసరుకలిపి త్రాగించిన మూత్రరోగములు, వాతరోగములు తగ్గును. ఆకు నూరి రసము తీసి విషపురుగులకాట్లకు నుపయోగించవచ్చును. చర్మవ్యాధులకుకూడ పసరు బాగుగా పనిజేయును. ఉత్తరేణిని భస్మము చేసి తదితర మందులలో కలిపి చర్మవ్యాధులకు, జీర్ణరోగములకు వాడిన తగ్గును.

మోతాదు:—పసరు సేరువరకు.

## —♦ ఉమ్మెత్త (Datura) ♦—

శ్లో॥ ధత్తూరః కితవో ధూర్తో దేవతా మదనశ్శఠః,
ఉన్మత్తో మాతులస్తూరీతరకః కనకాహ్వయః.

టీ॥ ధత్తూరః-కితవః-ధూర్తః-దేవతా-మదనః-శఠః,
ఉన్మత్తః-మాతులః-తూరీ- తరకః-కనకాహ్వయః — ఇవి ఉమ్మెత్తపేర్లు.

పువ్వులు ఆకులు పెద్దవిగనేయుండును. కాయలమీద ముండ్లుండును. కొన్ని జాతులకు ముండ్లుండవు. నల్లఉమ్మెత్త

చాల శ్రేష్టమైనది. తెలుపు నలుపు పసుపు పూవులుగల చెట్లుండును. పచ్చపువ్వులది దొరకుట కష్టము. తక్కినవి దొరకును. ఆకురసము వేడిజేయును. అరుగ్రివాపులకు, బెణుకులకు ఈ ఆకుపసరులో తగినంత వెన్నకలిపి మర్దనచేసిన తగ్గును. పశువులకు కలుగు వాతరోగములకు ఆకుపసరు బాగుగా పని చేయును. నల్లఉమ్మెత్త ఆకురసము విషపురుగుల కాట్లకు పని చేయును. నుసిమిరికి ఈఆకుపసరుతో తగినంత గంధకము కలిపి రాసిన మాడిపోవును. కుందేటివెఱ్ఱి అనువ్యాధికి నల్లఉమ్మెత్తాకుపసరులో తగినంత ఉప్పుకలిపి యిచ్చిన తగ్గును. ఈఆకు పసరును ఎక్కువగా వాడరాదు. దీనిలో విషవస్తువు లెక్కువగానున్నవి. పసుపు పువ్వుల ఉమ్మెత్తను భూతవైద్యులెక్కువగా వాడుదురు.

మోతాదు:—పసరు అర్థసేరువరకు.

## —♦ ఉసరిక (Myrabolan tree) ♦—

శ్లో॥ ధాత్రీఫలాఽమృతఫలామలకంశ్రీఫలంశివం.

టీ॥ ధాత్రీఫలా-అమృతఫలా-ఆమలకం- శ్రీఫలం - శివం అనునవి ఉసరిక పేర్లు.

దీనిఆకులు, పువ్వులు కాయలు ఔషధములయందు చువయోగపడుచున్నవి. దీనిచెక్క కాయలరసము వగరుగ పులుపుగనుండును. రసము చలువచేయును. పశువులకు కలుగు రక్త వాతరోగముల కన్నిటికి తదితర మందులతో కలిపివాడిన బాగుగా పనిచేయును. పశువులకు కలుగు దొమ్మలకు త్రిఫల

ములు అనగా కరక్కాయ, తాడికాయ, ఉసరికపప్పుతో కలి నీరుకలిపి రెండుమూడు మోతాదులిచ్చిన తగ్గును. ఇంకను ఉసిరికపప్పు కషాయము ప్రత్యేకముగా విరేచనములు కట్టించుటకు ఈయవచ్చును.

మోతాదు:—6 తులములకువరకు.

—♦ ఊడుగ (Alangium Decapetalum) ♦—

శ్లో॥ అంకోలక స్తామ్రఫలః పీతసారో నికోచకః,
గుప్తస్నేహో విరేచీస్యాద్భూషితో దీర్ఘకీలకః.

టీ॥ అంకోలకః-తామ్రఫలః-పీతసారః-నికోచకః-గుప్తస్నేహః-విరేచీ-భూషితః-దీర్ఘకీలకః అనునవి ఊడుగపేర్లు.

ఇది సాధారణమైనచెట్టు. దీని యాకులు సన్నముగా రెండుమూడు అంగుళములు పొడవుగనుండును. తెలుపురంగుగల పూవులు పూయును. దీనికాయలు పచ్చిగనున్నపుడు నలుపుగను పండినపుడు ఎరుపుగను ఈతకాయంత ఆకారముగలిగి యుండును. దీని చెక్కరసము చేదుగనుండును. వేడిజేయును. విషపురుగుల కాట్లకు బాగుగా పనిచేయును. పశువులకు కలుగు కడుపునొప్పి కామెర్లు చర్మరోగములకు ఈచెక్కరసమును వాడవచ్చును.

మోతాదు:—చెక్కరసము ముప్పాతిక సేరువరకు.

—♦ ఎర్రకలువదుంప (Red water lily) ♦—

శ్లో॥ రక్తోత్పలం కోకనదం హల్లకం రక్తసంధ్యకం.

టీ:—రక్తోత్పలం - కోకనదం - హల్లకం - రక్తసంధ్యకం అనునవి ఎర్రకలువపేర్లు.

ఇది చెరువులలోను, నీటిగుంటలలోను ఉండుపుష్పజాతి తీగ. దీనియాకులు తామరాకులవలె వెడల్పుగానుండును. ఇది ఎరుపు, తెలుపు, నలుపు పూవుల భేదముకలిగియుండును. గర్భవాతమునకు, చూడిపశువులకు వేడిజేసినప్పుడును, నెత్తురు పారుచున్నప్పుడును ఎర్రకలువదుంపనువండి వేరిననెయ్యితో కలిపిపెట్టిన తగ్గును. చలువచేయును. బలవర్ధకముగా నుండును. ఈదుంప అజీర్తి, పారుడు, విరేచనములకు బాగుగపనిచేయును. పువ్వులరేకులు పశువులకు కలుగుహృదయ రోగములకు పనిచేయును. వాతరోగముగల పశువులకు పెట్టరాదు.

మోతాదు:—దుంప సవాశేరువరకు.

## —• ఏనుగ పల్లేరు (Pedalium Murex) •—

శ్లో॥ శ్వదంష్ట్రాస్థూలశృంగాట షడంగఃక్షురకస్త్రికః

టీ:—శ్వదంష్ట్రా - స్థూలశృంగాటః - షడంగః- క్షురకః త్రికః - అనునవి ఏనుగపల్లేరు, పెద్దపల్లేరు అనిపేర్లు.

ఇది చిన్నచెట్టు. తెలుపుగనుండును. వర్షాకాలమునందు బాగుగా మొలచి వేసవియందు మాడిపోవును. దీని పువ్వులు నూవుపువ్వుల ఆకారముగలిగి పసుపుపచ్చగనుండును. కాయలు గచ్చకాయలంత పరిమాణముగలిగి ప్రక్కలయందు నాలుగు ముండ్లుండును. దీనినే ఏనుగపల్లే రనియు, పెద్దపల్లే రనియు, వాడుదురు. ఇందు చిన్నపల్లే రొకటి కలదు. ఇది నేల ప్రాకును.

ఆకులు చింతాకులవలె నుండును. దీనిపువ్వులు చిన్నవిగఎరుపుగ నుండును. దీని కాయలకు నాలుగు జంటముండ్లుండును. గొల్లలు వీనిఆకులను పెరుగులో నీరుపోసి వేయుదురు. వెంటనే పెరుగు గట్టిపడును. దీని ఆకు, కాయరసము చలువచేయును. దీని ఆకు పసరులో బియ్యపునీరు కలిపియిచ్చిన కురమయనురోగము శాంతించును. పల్లేరుకాయలనుమాడ్చి పొడిజేసి తులం నూరేకారం లోకలిపి సేరుకలిసీరుతో యిచ్చిననీరుచురుకు, శిలామేహవాతము తగ్గును. ఆరంభములోనే చేయవలెను. శుక్లనష్టమునకు ఆకు పసరు పనిచేయును. పల్లేరువేళ్లరసముకూడ మూత్రరోగములకు పని చేయును. ఆకురసములో తగినంతనూనె కలిపి వాతనొప్పులకు మర్దన చేసిన తగ్గును. మోతాదు:—ఆకురసము సేరు.

—♦ ఎలుగుబంటు నెత్తురు (Blood of Bear) ♦—

దీనిరక్తము వేడిజేయును. ఇది దొరకుట చాలకష్టము. దొమ్మ, పెద్దరోగము, గురక మున్నగు రోగములకు ఈరక్తము బాగుగా పనిచేయును. మరొకజంతువు నెత్తురుతీసికొనివచ్చి ఎలుగుబంటినెత్తురని మోసపుచ్చుదురు. కాబట్టి ప్రత్యేకముగా దాని నెత్తురు వాడిన బాగుగా పనిచేయును.

మోతాదు:—ఆరుతులములవరకు.

—♦ ఏలకులు (Alpina Cardamamum) ♦—

శ్లో॥ ఏలాతుత్రుటిశ్చంద్రబాలా బహులానిష్కుటి స్త్విషా,
కపోతవర్ణాసూక్ష్మైలా కోనటీద్రావిడీమదీ.

టీ॥ ఏలా-తుత్రుటిః-చంద్రబాలా-బహుళా-నిష్కుటిః-త్విషా,

కపోతివర్ణా-సూక్ష్మలా-కోనటీ-ద్రావిడీ - మదీ - అనునవి ఏలకుల పేర్లు.

అడవులలోను, ఎత్తుగానుండు ప్రదేశములందును పెరుగును. అల్లమువలెనే ఇవియును జీర్ణమగును, వేడిజేసిఆర్పును. శుక్లనష్టమునకు, మూత్రరోగములకు వాడవచ్చును. శరీరములోనుండు వాయువును పోగొట్టును. వాతజీర్ణరోగములలో బాగుగా పనిచేయును. బలవర్ధకౌషధములతో ఈ పొడిని వాడవచ్చును.

మోతాదు:—4 తులములవరకు.

## —♦ కరక్కాయ (Terminalia Chebula) ♦—

శ్లో॥ శివాహరీతకీ పథ్యాచేతకీ విజయాజయా,
పరిపథ్యాప్రమథా మోఘా కాయస్థాప్రాణదామృతా,
జీవనీయాహైమవతీ పూతనాపృతనాభయా,
వయస్థా నందినీజ్ఞేయా శ్రేయసీరోహిణీతథా.

టీ॥ శివా-హరీతకీ-పథ్యా-చేతకీ-విజయా-జయా
ప్రపథ్యా-ప్రమథా-అమోఘా-కాయస్థా-ప్రాణదా-అమృతా
జీవనీయా-హైమవతీ-పూతనా-పృతనా-అభయా
వయస్థా-నందినీ-శ్రేయసీ-రోహిణీఅనునవి కరక్కాయ పేర్లు.

ఈచెట్టు పెద్దవృక్షము. ఆకులు మందముగ పెళుసుగనుండును. విజయ, రోహిణి, పూతన, అమృత, అభయ, జీవంతి, చేతకి, అని కరక్కాయలు ఏడువిధములుగనుండును. విజయ కరక్కాయ సొరకాయవలె గుండ్రముగనుండును. రోహిణి కర

క్కాయ గుండ్రముగనుండును. పూతన కరక్కాయ చిన్న దిగనుండును. అమృతకరక్కాయకు బీజము చిన్నదిగను కండ మిక్కిలి మందముగ ఉండును. అభయకు అయిదు రేఖలుండును. జీవంతి బంగారురంగు కలిగియుండును. చేతకికి మూడు రేఖలుం డును. విజయ సర్వరోగములందును, రోహిణి వ్రణరోపణము నందును, పూతన లేపవిధియందును, అమృత శోధనమునందును, అభయ నేత్రరోగములందును,జీవంతి సర్వరోగములందును,చేతకి చూర్ణయోగములందును వాడదగియుండును. చేతకి యను కర క్కాయ తెలుపునలుపు భేదముచేత రెండురకములుగానుండును. తెల్లచేతకకరక్కాయ ఆరుఅంగుళములపొడవుగను, నల్లచేతకి కరక్కాయ ఒక అంగుళము పొడవుగ నుండును. పై భేదములలో కొన్నిస్పర్శమాత్రమునను, కొన్నిదృష్టిమాత్రమునను, కొన్ని వాసనచూచినంత మాత్రమునను, కొన్నితినినను విరేచనము చేయు స్వభావము కలవిగనుండును. అన్నిటిలో విజయ కర క్కాయ మిగుల శ్రేష్ఠమైనది.

కరక్కాయకండయందు మధురరసము, స్నాయువుల యందు ఆమ్లరసము, తాడిమయందు చేదు, చర్మమునందు కారము,గింజయందు వగరు యిట్లు అయిదురుచులు కరక్కాయ యందున్నవి. కరక్కాయ వగరుగా నుండును. చలువచేయును. వాత, రక్త, జీర్ణ, శ్వాసరోగములకన్నిటికి ఈ కరక్కాయ పొడి బాగుగా పనిచేయును. కరక్కాయపొడి కవిరిపొడి కొబ్బరి నూనెలో కలిపి గాయములకు పుండ్లకు వాడిన తగ్గును.

మోతాదు:—పొడి 6 తులములవరకు

## —♦ కలబంద (Aloe Barbadensis) ♦—

శ్లో॥ కుమారీ మండలామాతాగృహకన్యాతిపిచ్ఛిలా,
రసాయనీ కంటకినీ బహుపుత్రావనోద్భవా.

టీ॥ కుమారీ-మండలా-మాతా-గృహకన్యా-అతిపిచ్ఛిలా- రసాయనీ-కంటకినీ-బహుపుత్రా-వనోద్భవా-అనునవి కలబంద పేర్లు.

కలబంద యనునది యొకగుల్మము. మందమైన మట్టలును మట్టలలో మదపువాసనగల గుజ్జును ఉండును. కాయ, ఆకు, వెన్ను మొదలగునవిలేవు. సర్వాంగ సారమైన మూలిక. వైద్యమునందు మట్టలనే ఎక్కువగా వాడుదురు. మట్టలరసం జిగటగా తీగలు సాగుచుండును. చలువచేయును. విరేచనము గావించును. బలవర్ధకౌషధములలో మట్టలనుంచి తయారగు ముసాంబరమను పొడినికలిపివాడిన పనిచేయును మట్టలరసములో పటికగంధకము సమానభాగములుకలిపి చర్మరోగములకు నలిగిన గాయములకు వేసిన తగ్గును.

మోతాదు:—5 తులములవరకు ముసాంబరము.

## —♦ కవిరి (Acacia Catechu) ♦—

ఇది చంద్రచెట్టునుండి తయారుచేయబడువస్తువు. దీనినే ఖైరసారము, కాచుఅందురు. వెగటుగ,వగరుగనుండును. చలువచేయును. విరేచనముల కట్టించును. చర్మరోగములకు నోటిపూతకు దీనిని తదితర మందులలో కలిపియిచ్చిన తగ్గును.

మోతాదు:—3 తులముల వరకు.

## —♦ కటుకరోహిణి (Hellibrous Niger) ♦—

శ్లో॥ కటుకీ రోహిణీతిక్తా చంక్రాంగా కటురోహిణీ।
మత్స్యపిత్తా పాండరుహా కృష్ణభేదీ ద్విజాంగికా।
ఆశోకారోహిణీ మత్స్యాసకులాశకులాదనీ॥

టీ॥ కటుకీ-తిక్తా-చక్రాంగా-కటురోహిణీ-మత్స్యపిత్తా-పాండరుహా-కృష్ణభేదీ - ద్విజాంగికా - ఆశోకా - రోహిణీ - మత్స్యాసకులా - శకులాదనీ - అనునవి కటుకరోహిణి పేర్లు.

ఇది తెలుపు నలుపు రెండురకములు. ఆకులు చేదుగనుండును. ఎక్కువ మోతాదుల నీయరాదు. నల్లదానికంటె తెల్లకటుకరోహిణి చురుకుగ పనిచేయును. వేపచెక్కపొడి, యష్టిమధుకము, కటుకరోహిణి నీరుకలిపి కాచిన కషాయము బలవర్ధకౌషధముగా రక్తసంబంధమగు రోగములయందు వాడవచ్చును. కటుకరోహిణిని బలవర్ధకౌషధములలో కలిపి వాడవచ్చును.

మోతాదు:— $1\frac{1}{2}$ తులములవరకు.

## —♦ కరివేప (Bergera koenigh) ♦—

శ్లో॥ కైడర్యోథ మహానింబో రావణో గిరినిమ్బకః.

టీ॥ కైడర్యః-మహానింబః-రావణః-గిరినింబకః-అనునవి కరివేప పేర్లు.

ఈచెట్టు చెక్క వేరు చేదు కారముగనుండును. ఆకు సువాసనగా నుండును. ఆకురసము చలువచేయును. విరేచనముల కట్టించును. గొడ్డుబోతుతనముగల పశువులకు ప్రతిదినము

నాలుగు గుప్పెళ్ల వంతున ఉండచేసి వారముదినములు పెట్టిన చూలు నిలుచును. ఇంకను క్రిమిరోగములకు వాతరోగములకు వాడవచ్చును.

## —♦ కరిధూపము (Vegetable black) ♦—

అనగా పొయ్యిగలచోట పొగ పైకిబోయి యింటివాసములకు పట్టును. దీనినే కరిధూప మందురు. దీనిని భద్రపరచి వస్త్రగాలితముచేసి పశువులకు గలుగు రక్తసంబంధమగు వ్యాధులలో వాడిన పనిచేయును. ఇది చర్మరోగములకు తదితర మందులలో కలిపి వాడవచ్చును. వేడిజేయును.

మోతాదు:—2½ తులములవరకు.

## —♦ కసివెంద (Cassia Occidentalis) ♦—

శ్లో॥ కాసమర్దః కర్కశస్స్యాద్గృంజనో గజర స్తథా.

టీ॥ కాసమర్దః-కర్కశః-అనునవి కసివెందాకు పేర్లు
గృంజనః-అగజరః-అనునవి కమ్మకసివెందాకు పేర్లు

ఇది చిన్నచెట్టు. భూమిపై మువ్వావుగజమువరకు పెరుగును. చెట్టంతియు వెగటువాసనగా నుండును. దీని కాయలు పెసరకాయలవలెనుండును. పసుపుపచ్చని పూవులుపూయును. ఆకులు కొంచెము కోలగమొనదేలక గుండ్రముగనుండును. ఆకురసము చేదుగనుండును. వేడిజేయును. వెన్నతో ఆకుపసరు కలిపి అరుచాపులకు, పక్షవాతములకు ఉపయోగించవచ్చును. ఇంకను పసరు నేత్రరోగములకు చర్మరోగములకు బాగుగా పనిచేయును.

—♦ కలకండ (Sugar candy) ♦—

దీనినే పటికబెల్లమందురు. చలువచేయును. మూత్ర రోగములకు, నేత్రరోగములకు నుపయోగపడును.

—♦ కల్లు (Toddy) ♦—

తాటి కొబ్బరి ఈత మొదలగుచెట్లనుండి తీయుదురు. పుల్లగా, తీపిగానుండును. చలువచేయును. పశువునకు వేడిజేసి నప్పుడును, తదితర రక్తసంబంధమగు రోగములలోను దీనిని బాగుగా వాడవచ్చును. వేసవికాలములో దీని నెక్కువగా మూత్రరోగములలో వాడవచ్చును. ఎండదెబ్బకు ఈయ వచ్చును.

— ♦కలినీరు (Acid whishings of raw rice) ♦—

బియ్యము కడిగిననీటిని, జొన్నలు కడిగిననీటిని కలి నీరందురు. చలువచేయును. పుల్లగా స్వాదుగానుండును. పశువులకు కలుగు కాకరోగములన్నిటికిని, తదితర రోగములలో అనుపానములుగను వాడవచ్చును. నీరుచురుకు తగ్గించును.

—♦ కురాసానివాము (Black hembane seeds) ♦—

ఇది జీర్ణసంబంధమగురోగములకు బాగుగాపనిచేయును. ఈమొక్కలు గుబురుగా పెరుగును. ఈ వాములో మత్తును గలిగించుగుణము కలదు. గర్భవాతమునకు, ద్రగ్గునకు, కడుపు నొప్పికి, తదితరశూలలకు కారపుపాలలో కలిపి త్రాగించిన

బాగుగాపనిచేయును. ఈ గింజలరసముతీసి కండ్లకు అంజనము వేసిన శిరోభారము తగ్గును.

మోతాదు:—4 తులములవరకు.

—♦ కొబ్బరికాయ (Cacoanut fruit) ♦—

పచ్చికొబ్బరి కాకజేసి ఆర్చును. చమురుగలిగి రుచిగా నుండును. తవుడు చిట్టు ఎక్కువగాపెట్టిన పశువులకు ప్రతి దినము ఒకకాయవంతున పెట్టినచో వాతముచేరక మామూలు గా పాలు యిచ్చును. పచ్చికొబ్బరి పెట్టుటవలన ఎక్కువగా పాలనిచ్చును. వాతరోగములలో కొబ్బరిపాలుతీసి తగినంత వాముకరసముకలిపి యిచ్చినచో బాగుగాపనిచేయును. కొబ్బరిని నీటిలోవేసి త్రొక్కిగాని రుబ్బిగాని తీయగావచ్చిన వాటినే కొబ్బరిపా లందురు. ఇవి చలువచేయును. ఇంకను రక్తసంబంధ మగు రోగములలో ఈపాలను బలవర్ధకముగా ఈయవచ్చును.

—♦ కొబ్బరిపిండి (Cocoanut flour) ♦—

ఎండుకొబ్బరిచిప్పలనుండి నూనెతీసినతరువాత మిగిలిన పిప్పినే కొబ్బరిపిండియందురు. ఈ పిప్పి పాడిపశువులకు పెట్టి నచో పాలు బాగుగాయిచ్చును. వెన్న గట్టిగానుండును. ప్రత్తి పిండికంటె చౌకగానుండును. ఎండుకొబ్బరి చిప్పలలో కల్లు బెల్లము తగినంతగాకలిపి త్రొక్కి పెట్టిన వాతరక్తసంబంధ మగు రోగములు హరించును.

—♦ కొడిశపాల (Anti-dysentricum) ♦—

శ్లో॥ ఐంద్రోయవ స్తస్యఫలంకాళింగః కౌటజోమతః
శక్రాహ్వః పురుహూతశ్చప్రోక్తోభద్రియవ స్తథా.

టీ॥ ఐంద్రియవః-కాళింగః-కౌటజః-శక్రాహ్వః,
పురుహూతః-భద్రియవః అనునవి కొడిశపాల పేర్లు.

అరణ్యములలో పెరుగు పెద్దవృక్షము. చెట్టుబెరడు తెలుపుగనుండును. చెక్కరసము ఎరుపుగ చిక్కగ జిగటగ నుండును. ఆకులు గుండ్రముగ నునుపుగనుండును. ఆకువెనుక వైపు తెలుపుగనుండును. దీని కొమ్మలను యిండ్లకప్పులకు వాసములుగ నుపయోగించుదురు. ఈ గింజలనుండి నూనె తీయుదురు. ఈ నూనెను వాతనొప్పులకు చర్మవ్యాధులకు విస్తారముగా వాడుదురు.

—♦ కుడితి (Rice washings) ♦—

పాడిపశువులకు బియ్యపుకుడితి, జొన్నకుడితి, గంజి, మజ్జిగ, తవుడు కలిపిన కుడితి మొదలగునవి ఉదయ సాయం కాలములందు పాలుపితుకకపూర్వము పెట్టుదురు. ఈ కుడితి పెట్టుటచే పశువులకు సంతోషముకలుగును. పశువు పాలున్నంత వరకు బాగుగాచేపును. నిలువయున్నకుడితి త్రాగినచో పశువులకు రోగములుకలుగును. కుడితినిగురించి "పాడిపరిశ్రమ" యను గ్రంథములో చూడుడు.

—♦ క్రొవ్వు (Fat) ♦—

దీనిని మలాములలో ఎక్కువగా వాడుదురు. ఇది పొక్కిన ప్రదేశములయందు పూయుటకును, కోమలములైన భాగములకు గాలితగులనీయక రక్షించుటకును మిగుల నుపయోగకారి. పశువులకు చర్మవ్యాధులకు, బెణుకులకు, కణతు

లకు తదితర మందులతోఁ కలిపి వాడవచ్చును. అరుగ్రివాపులకు రాసినయెడల మిగుల మెత్తబడును.

## —♦ కోడిగుడ్లు (Fowl eggs) ♦—

ఈగుడ్లను వాడునప్పుడు రెండుమూడు దినముల క్రిందట పెట్టినవాటిని యుపయోగించవలెను. రుచిగనుండును. రక్తమును వృద్ధిచేయును. గుడ్లలోనుండు తెల్ల సొనను మంచినూనెలోఁ కలిపి పశువుల కాళ్లకు సంభవించు దెబ్బలకు కవుకుదెబ్బలకు జెబ్బనొప్పులకు పట్లువేసినయెడల తగ్గును. సొన చలువచేసి ఆర్చును. బుడ్డకొట్టినతరువాత వారముదినములు గుడ్లనుపెట్టిన బలముకలుగును. పశువులకు విషము పెట్టినచోఁ విరుగుడుగా ఈగుడ్లలోని తెలుపును గంజిలోఁ కలిపి యిచ్చిన విషము విరుగును. కోడిగుడ్డు పైడొల్లలను మెత్తగా నూరి నిమ్మకాయ రసముతోఁ కలిపి చెవిగోఁగములకు వాడిన యెడల బాగుగా పనిచేయును.

మోతాదు:—1 నుంచి 10 గుడ్లవరకు.

## —♦ కోడినెత్తురు (Blood of fowl) ♦—

కోడిరక్తమెట్టగా నుండును. మిగుల వేడిజేయును. పశువుల అవయవములలో నేభాగమైన విరిగినయెడల వెంటనే నెత్తురు గుడ్డకు పట్టించి విరిగినభాగమునకు చుట్టవలెను. ఆకట్టు వారముదినములవరకు తీయరాదు. తరువాతతీసి మరల ఉత్తరేణిఆకు నూరి కట్టిన నెమ్మదించును. దీర్ఘవాతములలో కోడిపెట్టమాంసముతో తదితరవస్తువులు తొక్కిపెట్టిన తగ్గును.

—♦ కోడిరెట్ట ♦—

అప్పుడు వేసిన పచ్చిరెట్టను తీసికొని అర్ధసేరు వేడినీటిలో కలిపి త్రాగించిన పశువులకు కలుగు జీర్ణ, వాతరోగములు తగ్గును. మిగుల మలబద్ధకముగానుండి పేడ వేయకయున్నచో కారపుపాలలో కోడిరెట్టను కలిపియిచ్చిన పేడవేయును.

మోతాదు:—6 తులములవరకు.

—♦ కస్తూరి పసుపు (Cuncuma longa, a sort of) ♦—

ఇదియును పసుపుజాతిలోచేరిన దే. దీనిసర్వాంగములును మామిడిచెట్టుయొక్క వాసనగలిగి యుండును. పసుపుకంటె చేదుగానుండును. కాకజేయును. ఈ పసుపును అరగదీసి గాయములకు పట్టించిన మానును. పశువులకుకలుగు చర్మరోగములకు కణతులకు వ్రణములకు బాగుగాపనిచేయును.

—♦ కుక్కపాల (Country Ipeca) ♦—

దీనినే వెర్రిపాల యందురు. దీని ఆకుపసరు రక్తవిరేచనములకు, దొమ్మలకు అద్భుతముగా పనిచేయును.

—♦ కుప్పింట (Acalypha Indica) ♦—

ఇది మూర్గొండాకుచెట్టుజాతిలోనిది. దీని ఆకులు కొంచెము కోలగానుండును. ప్రతిదొడ్డిలోను ఈ మొక్కలు మొలచును. ఆకురసము ఘాటుగానుండును. చర్మవ్యాధులకు బాగుగా పనిచేయును. మూర్గొండాకు గుణములే దీనికిని గలవు. శ్వాసరోగములలో ఈ పసరును ముక్కురంధ్రము

లలో పోసిన బాగుగాపనిచేయును. ఆకురసములో సున్నము కలిపి గజ్జినుసిమిరికి వాడవచ్చును.

—♦ కుంకుడు (Sanpindus) ♦—

శ్లో॥ అరిష్టకో గర్భపాతీ కుమ్భవీర్యశ్చ ఫేనిలః,
కృష్ణబీజో రక్తబీజః పీతఫేనోర్థసాధనః.

టీ॥ అరిష్టకః-గర్భపాతీ-కుంభవీర్యః-ఫేనిలః
కృష్ణబీజః-రక్తబీజః-పీతఫేనః - అర్థసాధనః-అనునవి కుంకుడు పేర్లు.

ఇది పెద్దవృక్షము. ఆకుకొంచెము కోలగ గుండ్రముగ నుండును. కాయలు చిన్నవిగ పూవులు తెల్లగ గుత్తులుగ నుండును. కాయలను నీళ్లతో నూరిన నురుగువచ్చును. కాయలు చేదుగ నుండును. వేడిజేయును. చర్మరోగములలోను, పేను, మిన్నల్లులు పట్టినపుడును ఈ కాయల నురుగుతో శుభ్రము చేయుటమంచిది. పశువుల తోకలకుగలుగునుసిమిరి, గురుజు మున్నగు వ్యాధులకు ఈ నురుగును పట్టించవచ్చును. దొమ్మ లకు ఈ నురుగును త్రాగించిన తగ్గును.

—♦ కానుగ (Pongamia glabra) ♦—

ఈ చెట్టుచెక్క, ఆకురసము వెగటుగా చేదుగనుండును. ఈ చెట్టుయొక్క సర్వాంగములు వెగటువాసనగ నుండును. వేసవికాలమందు చిగురుపట్టి పూచును. పూత తెలుపు నలుపు రంగుగా నుండును. కాయలు కొంచెము వంకరగ బల్లపరపుగ నుండును. ఆకురసము చర్మరోగములకు బాగుగాపనిచేయును.

పురుగులుపడినపుండ్లకు తదితరగాయములకు ఈ గింజలనుండి తయారుచేయబడిన నూనెను వాడిన చక్కగామానును. దీని ఆకులునూరి పురుగులు పడినపుండ్లకుకట్టిన పురుగులు చచ్చును. చెక్కరసము వాతరోగములకు యిచ్చిన తగ్గును. గానుగగింజలను పెరుగుతోనూరి పురుగులుపడిన పుండ్లకు కట్టిన మానును.

మోతాదు:—చెక్కరసము అర్ధసేరువరకు.

—♦ కాకర (Momardica charantia) ♦—

శ్లో॥ కారవేల్లంకటిల్లంస్యా దుగ్రకాండం సుకాండకం.

టీ॥ కారవేల్లం - కటిల్లం - ఉగ్రకాండం - సుకాండకం - అనునవి కాకరపేర్లు.

ఇది తీగెజాతిలోనిది. దీనిలో అనేకజాతులు గలవు. దీని ఆకులు చిల్లులుగలిగి సుమారు మూడంగుళముల వెడల్పు గలియుండును. పువ్వులు పసుపుపచ్చగ నుండును. పెద్ద కాకరకాయలు గొగ్గులుకలిగి పొడవుగనుండును. పొట్టికాకరకాయలు గుండ్రముగనుండును. పొట్టికాయలు మిగులచేదుగానుండును. ఆకురసము చేదుగానుండును. వేడిజేయును. విషజంతువుల కాట్లకు, నేత్రరోగములకు, చర్మవ్యాధులకు పనిచేయును. వాతరోగములకు పసరును తదితర మందులలోకలిపి వాడవచ్చును.

మోతాదు:—పసరు అర్ధసేరువరకు.

—♦ కామంచి (Solanum Nigrum) ♦—

శ్లో॥ కాక మాచీధ్వాంక్షమాచీ కామచీజఘునీఫలా,
రసాయనవరా సర్వతిక్తాస్యాత్కాకినీకటుః.

టీ॥ కాకమాచీ-ధ్వాంక్షమాచీ-కామచీ-జఘనీఫలా
రసాయనవరా-సర్వతిక్తా-కాకినీ-కటుః-అనునవి కామంచి పేర్లు

దీనినే కాచి లేక కాసరచెట్టందురు. ఈ చెట్లుగజము పైగా పెరుగును. దీనికాయలు గుండ్రిశనగలంత యుండును. పచ్చికాయలు ఆకుపచ్చగను, పండినపుడు పగడపురంగుగను ఉండును. చెట్టంతయు మిరపచెట్టు ఆకారముగనుండును. పూవులు తెలుపుగ నుండును. ఆకురసము వేడిజేయును. జంతువుల విషము విరచును. విరేచనము గావించును. శ్వాసరోగములలో ఆకుపసరును వాడవచ్చును. ఆకురసమును చెవిమాదలకు వాడవచ్చును. చర్మరోగములకు ఆకుపసరులో తగినంతముద్దకర్పూరము కలిపిరాసిన తగ్గును.

మోతాదు:—ముప్పాతిక సేరువరకు.

## —♦ కాడివేప ♦—

దీనినే మేకమెత్తని దుంపలందురు. ఇవిమెట్ట మాగాని పొలములలోనుండును. ఈ దుంపలు తెచ్చి మేకపాలతోగాని ఆవుపాలతోగాని రుబ్బి ఉడికించి పట్టువేసినచో అరువాపులకు తదితరవాపులకు పనిచేయును. దీని ఆకు అంచులు గరకుగనుండును. తాడిచెట్లమీాదను, తదితర చెట్లమీాదను పాకును.

## —♦ కారింగువ (A sort of Assafoetida) ♦—

తెలుపుగనుండు ఈచెట్లు చిన్నవిగనుండును. పువ్వులు పెద్దవి. వికసించినపుడు తెలుపుగనుండును, కాని క్రమేపి పచ్చ

బడును. ఈ కారింగువ ఒక విధమైనజిగురు. పశువులకు కలుగు చర్మవ్యాధులకు బెణుకులకు పనిజేయును.

మోతాదు:—2 తులములవరకు.

## —♦ కావిరాయి (Bola Armenic) ♦—

ఇది పర్వతములయందుపుట్టు ఒక విధమైనరాయి. దీనిలో ఎరుపు పసుపు రకములుగలవు. కొన్ని దేశములలో ఈ రాళ్ళను తిందురు. శుభకార్యములందు కావిరాయిని అరుగదీసి వాడుకొందురు. కావిరాయి చలువచేయును. మూత్రరోగములకు పనిచేయును. వీర్యనష్టమునకు పెట్టవచ్చును. నేత్రరోగములలో ఈ రంగుగుడ్డను కండ్లకు కట్టిన చలువచేయును.

మోతాదు:-సేరువరకు.

## —♦ కందదుంప (Areen Campanulatum) ♦—

గ్రామములలోను పొలములందునువేసి పండించు ఊరకంద గూడ అడవికందయొక్క గుణములను కలిగియుండును. అడవికంద కున్నంతదురద దీనికుండదు. అంతచురుకుగ పనిచేయదు. మావివేయని పశువులకు ఈ దుంపను పులిచల్లతో గాని కలినీటితో గాని కలిపి నూరి త్రాగించినవెంటనే పడును.

మోతాదు:—6 తులములవరకు.

## —♦ ఖర్జూరకాయులు (Edible date fruit) ♦—

ఇది ఈతచెట్టును బోలియుండును. ఖర్జూరకాయలు చలువచేయును. రక్తసంబంధమగు రోగములలో అనగా గాలికుంటు, కురమ, పాలజ్వరము మున్నగు రోగములలో జ్వరము

తీవ్రముగా నున్నపుడు ఈ కాయలరసము త్రాగించిన చలువ చేయును. ఎండువాతము మున్నగు వ్యాధులలో ఖర్జూర పండుతో పాలుకలిపి ఒకవారము దినములుపెట్టిన తగ్గును.

మోతాదు:-పండు సవాసేరునుంచి అరవీసెవరకు.

## —♦ గంజాయి (Cannabis sativa) ♦—

దీనినే జ్ఞానపత్రియందురు. ఈ చెట్టు రెండుగజముల యెత్తులోపుగ పెరుగును. పూవులు గుత్తులుగపూచును. లేత మొక్కలను ఎలుకలు తినును. ఈ మొక్కలనుండి ఒక విధమైన నారయు, గింజలనుండి నూనెయు తయారుచేయుదురు. ఇది మత్తునుగలిగించును. పెద్దరోగము, పారుడు, రక్తవిరేచనములు మున్నగు రోగములలో దీనిని వాడిన బాగుగా పనిచేయును. చెవిమాదకు గంజాయిఆకును నూరి రసముతీసిపోసిన తగ్గును. దీనివిత్తులను కోళ్ళకు తినిపించిన విస్తారము గుడ్లనుపెట్టును. కొన్నిపక్షులకు తినిపించిన వానిరంగు మారును.

మోతాదు:—2 తులములవరకు.

## —♦ గచ్చ (Caesalpinia) ♦—

ఈ చెట్టు పొదవలెపెరుగును. పొలముయొక్క ఆవరణాల కొరకు చుట్టువేయుదురు. చెట్టంతయు చిన్న-చిన్న ముండ్లతో నిండియుండును. ఆకులు దరిసెనఆకులవలెనుండును. కాని అంత కన్న చిన్నవి. కాయలోనిగింజ నునుపుగ గట్టిపెంకుగలిగి యుండును. గచ్చగింజలో విషరూపమైన పప్పుండును. గచ్చపప్పు చేదుగ, వగరుగ, కారముగనుండును. శ్వాసరోగములలో ఈ

పప్పు బాగుగాపనిచేయును. దీనిఆకును శేరువాపునకు, దూడల జంటబొడ్డునకు తదితరకల్లవాపులకు ఆముదముతో వేయించి కట్టిన బాగుగాపనిచేయును.

మోతాదు:-గచ్చపప్పు 3 తులములవరకు.

## —♦ గజ్జేరు (Trianthema) ♦—

ఇది నేలమీదపాకును. దీనిలో తెలుపు ఎరుపు నలుపు రంగుల పూవులభేదము కలిగియుండును. గజ్జేరాకులు గుండ్రముగనుండక కోలగానుండును. పశువులకుకలుగు వాతరోగములకు, దొమ్మలకు, ఎముకలు విరిగినపుడు పసరు బాగుగాపని చేయును. గజ్జేరురసము వగరుగ వెగటుగ చేదుగనుండును. వేడిజేయును. తెల్లగజ్జేరు శ్రేష్టమైనది.

## —♦ గోరింట (Lawsonia Alba) ♦—

ఇది రెండుమూడు గజముల ఎత్తుపెరుగును. చిన్నఆకులును తెలుపుపూవులును కలిగియుండును. దీని ఆకులు నూరి గోళ్ళకు అరచేతులకు రాచుకొనిన యెడల ఎఱ్ఱబడును. ఇది విషతుల్యమైనది. పచ్చియాకునునూరి అందముకొరకు .పశువుల అవయవములకు పెట్టుదురు. దీని ఆకుపసరు చర్మవ్యాధులకు బాగుగా పనిచేయును. గాలికుంటులో నోటిగాల్లు తగిలినపుడు ఆకును కషాయముగా కాచి పుక్కిలింపు జేయించిన గారపట్టును. మానని మొండి వ్రణములకు ఆకులో పసుపువేసి నూరి కట్టిన మానును. కషాయము కాలినపుండ్లకు పట్టించిన తగ్గును.

—♦ గంటుభారంగి ( Clerodendron ) ♦—

శ్లో॥ భార్గీభృగు భవాపద్మకాసఘ్నీ గంధపర్వణీ ।
స్వరశాకంశుక్రమాతా భంజీబ్రాహ్మణయష్టికా ॥

టీ॥ భార్గీభృగుభవా-పద్మా-కాసఘ్నీ-గంధపర్వణీ స్వరశాకం-శుక్రమాతా - భంజీ - బ్రాహ్మణయష్టికా - అనునవి గంటు భారంగి పేర్లు.

గంటుభారంగి చేదుగనుండును. వేడిజేయును. శ్వాస వాతరోగములలో బాగుగా పనిచేయును.

మోతాదు: - 3½ తులములవరకు.

—♦ గుంటకలగర (Eclipta prostrata) ♦—

శ్లో॥ భృంగరాజో భేకరాజో మార్కవః కేశరంజకః,
అంగారకో మహానీలో భృంగాహ్వాస్సూర్యవల్లభః.

టీ॥ భృంగరాజః - భేకరాజః - మార్కవః - కేశరంజకః అనునవి గుంటకలగర పేర్లు.

అంగారకః-మహానీలః-భృంగాహ్వాః-సూర్యవల్లభః- అనునవి నల్లగుంటకలగర పేర్లు.

నీటిప్రదేశములందు విశేషముగా మొలచు చిన్న మొక్క. ఇది నలుపు పసుపు తెలుపు పూవుల భేదము కలిగి యుండును. ఇది సర్వాంగ సారమైనమూలిక. ఆకురసము చేదుగ నుండును. శరీరమునందలి చెడునీటిని లాగివేయును. నేత్రరోగ ములకు శిరోరోగములకు పనిచేయును. చర్మరోగములకు తది

తర మందులలో కలిపి వాడవచ్చును. ఆకు నూరి మలిమిడికి మిరియాలపొడితో కలిపికట్టిన తగ్గును.

మోతాదు:- అర్ధశేరువరకు.

—♦ గురువింద (Abrus precatorius) ♦—

శ్లో॥ గుంజా శిఖండికా తామ్రా రక్తికా కకణంతికా.

టీ॥ గుంజా-శిఖండికా-తామ్రా-రక్తికా- కకణంతికా అనునవి గురివింద పేర్లు.

గురువింద ఎరుపు తెలుపు నలుపు గింజలభేదము గలిగి యుండును. నలుపురంగుగింజలు అరుదుగ దొరకును. గురివిందాకులు చింతాకులవలె నుండును. ఆకులు నమలిన తీయగనుండును. గురువిందాకులో గ్లిసరైజిక్ యాసిడ్ ఉండును. ఎక్కువ మోతాదు నీయరాదు. వేడిజేయును. పశువులను చంపుటకు మాలమాదిగెలు ఈగింజలలోని పప్పును విషముగా పెట్టుదురు.

—♦ గండఫెరోజా (Galbanum of Ganda Biroza) ♦—

దీనినే సీమదేవదారుబంక అందురు. ఇది కొంచెము ఆకుపచ్చ పసుపుపచ్చ రంగుకలదిగా నుండును. ఇది యించుమించుగ ఇంగువగుణముకలదిగా నుండును. ఈ బంకను గ్లిసరీన్‌లోగాని కొబ్బరినూనెలోగాని గంగసిందూరములోగాని కలిపి పట్టించిన కంతులు కరుగును. పగులని గడ్డలను పగులగొట్టును. కొమ్ములు విరుగుట, మాదలు, మొరడుగాయములకు నుపయోగపడును.

—♦ గోగు (Cannabis Sative country) ♦—

శ్లో॥ పీలుశ్శతసహస్రాంశీ తీక్ష్ణకఃకరభప్రియః,
సహస్రాంగీ గుడఫల స్తత్ఫలం పీలుపీలుజమ్.

టీ॥ పీలుః-శతసహస్రాంశీ-తీక్ష్ణకః-కరభప్రియః,
సహస్రాంగీ-గుడఫలః అనునవి గోగు పేర్లు.

దీనిలో దేశవాళీగోగు పుల్లగోగు ధనాసరిగోగు యెర్ర గోగు మున్నగు రకములు కలవు. మెట్టచేలలో పెరిగిన పుల్ల గోంగూర శ్రేష్ఠమైనది. సన్ననికాడవలె పొడవుగ మొల చును. ఆకులు పూవులు పుల్లగనుండును. పాలుకుడుచు దూడ లకు అప్పుడప్పుడు గోంగూర పెట్టుట మంచిది. విరేచనము గావించును. వాపులకు, పంపరకు, బొడ్డుపుండ్లకు గోంగూర ఉడికించిగాని, ఆముదముతో వేయించిగాని కట్టిన పనిచేయును.

—♦ గొబ్బి (Asteracantha Longifolia) ♦—

శ్లో॥ ఇక్షురః క్షురమేధాండః కోకిలాక్షః క్షురస్మృతః,
తైలకండః తి క్తరిక్షుర్బాలికా చేక్షుగంధికా.

టీ॥ ఇక్షురః-క్షురమేధాండః-కోకిలాక్షః-క్షురః-స్మృతః,
తైలకండః- తి క్తరిక్షుః-బాలికా - ఇక్షుగంధికా - అనునవి గొలిమిడి లేక గొబ్బి, నీరుగొబ్బి పేర్లు.

ఇది నీళ్ళవారపెరుగు చిన్నమొక్క. వాడిగల ముండ్లు చెట్లంతటట యుండును. సన్నని పొడవుగలకాడ లుండును. తెలుపు నలుపు పువ్వులుగల చెట్లుండును. తెలుపుదే శ్రేష్ఠము.

ఆకు విరేచనము గావించును. క్రిమిని చంపును. దూడలు పేడ వేయక మందమతిగా నుండునప్పుడు ఆకుతోనొక్క ఆముద ముతో కలిపిపెట్టిన విరేచనమగును. ఆకురసము చలువచేయును. మూత్రరోగములలోకూడ ఈ ఆకుపసరు వాడవచ్చును.

మోతాదు:- 6 తులములవరకు.

## —♦ గసగసాలు (Poppy seeds) ♦—

శ్లో॥ తిలభేదఃఖసతిలశ్శుభ్రపుష్పో లసత్ఫలః ॥

టీ॥ తిలభేదః-ఖసతిలః-శుభ్రపుష్పః-లసత్ఫలః అనునవి గసగసాల పేర్లు.

పోస్తుచెట్టుయొక్క గింజలకు గసగసాలని పేరు. మిక్కిలి చిన్నవిగ తెలుపుగనుండును. ఈ చెట్లనుండియే నల్లమందు తయారుచేయుదురు. గసగసాలు వేడిజేయును. జీర్ణరోగములకు వాడవచ్చును. పారుడురోగమును కట్టించును. తదితర బలవర్ధకౌషధములలో కలిపివాడవచ్చును. వాతముగల పశువులకు వాడరాదు. మోతాదు:- 4 తులములవరకు.

## —♦ గోరోజనము (Biliary calaculus of cow or ox) ♦—

ఆవు, ఎద్దు యొక్క పిత్తకోశములోని చేదునకు గోరోజనమని పేరు. ఇది వెగటుగ నుండును. వేడిజేయును. నరములకు సత్తువనిచ్చును. విషజంతువులకాట్లకు పూసిన నెమ్మది యగును. ఇంకను వాతరోగములకు శ్వాసరోగములకు కూడా పనిచేయును.

—♦ గంజి (Gunjee) ♦—

వేడిగనున్న వరిఅన్నపుగంజి చలువచేయును. దప్పిక నార్పును. త్వరగ జీర్ణమగును. నీరసముగానుండు పశువులకు పెట్టుట మంచిది. పశువులకు కలుగువ్యాధులలో దీనిని పథ్యముగా పెట్టవచ్చును. తదితరమందులలో కలిపి ఈయవచ్చును.

—♦ గాడిదగడప (Aristolochia Bracteata) ♦—

ఇదియొకతీగ. నలుపుగలసిన ఆకుపచ్చరంగు గలదిగానుండును. దీనికాయలు లేతబుడమకాయంత యుండును. ఆకు గరుకుగ నుండును. అడవులయందును కంచెలయందును విశేషముగా పెరుగును. దీనివేరు, కాడ, ఆకు చాల చేదుగ నుండును. పసరు అతివేడిజేయును. పశువులకు కలుగు వాతరోగములకు, సమస్తవాపులకు, బాగుగాపనిచేయును. చర్మరోగములకు ఆకు పసరులో హారతికర్పూరము కలిపి నాలుగైదు పూతలు పెట్టిన తగ్గును. దూడలకు ఎలుకపాములు, నుసిపురుగులు పడినపుడు ఈ ఆకుపసరు పెట్టిన జారించి విరేచనమగును. విషపురుగుల కాట్లకు ఈ పసరును త్రాగించిన బాగుగా పనిచేయును.

మోతాదు:- పసరు అర్ధసేరు వరకు.

—♦ గాజరగడ్డలు (Daucus Carota) ♦—

ఇది యొక చిన్న మొక్క. దీని యాకులు చిల్లలుగలవిగనుండును. దీనిపూవులు మనోహరముగ గుత్తులు గుత్తులుగ పూచును. దుంప నారింజపండువర్ణము గలిగియుండును. ఈ

దుంపలను మేకపాలతోగాని ఆవుపాలతోగాని రుబ్బి ఉడికించి పట్టువేసినచో అగుర్వాపులు, వ్రణములు తగ్గును.

## —♦ గారచెట్టు (Balanites Aegyptica) ♦—

శ్లో॥ ఇంగుదోభల్లకావృక్షః కంటకస్తాపసద్రుమః.

టీ॥ ఇంగుదః - భల్లకావృక్షః - కంటకః - తాపసద్రుమః- అనునవి గారచెట్టు పేర్లు.

గారచెట్టు పెద్దవృక్షము. దీని కాయలు గుండ్రముగ బల్లపరపుగ సుమారు రెండంగుళముల వలయము గలవిగ నుండును. కాయపై పెంకు మిక్కిలి గట్టిగనుండును. గార కాయలోని పలుకులు తీసివైచి అందు తిరుచూర్ణము, పొగాకు పొడి వేసికొందురు. చెట్టునకు ముండ్లుండును. పూవులు నిమ్మ పువ్వులను బోలియుండును. చెక్క మదపువాసనగా నుండును. రోటిలోవేసి రుబ్బిన నురుగువచ్చును.

ఈ చెట్లముండ్లను తోక సంబంధమగు రోగములకు గుర్చ్చుదురు. దీనికాయలు పిందెలు వేరు చెక్క జీర్ణరోగ ములకన్నిటికి బాగుగా పనిచేయును.

## —♦ గుగ్గిలము (Baellium) ♦—

గుగ్గిలపుచెట్టుయొక్క బంకకు గుగ్గిలమనిపేరు. గుగ్గిలము ముక్కలుముక్కలుగ పచ్చగ ఎరుపురంగుగ నుండును. పరిమళముగలది. దీనిపొగ దేవతారాధనయందు ప్రశస్తముగ నుపయోగింతురు. రసవీర్యాదులయందు మహిసాక్షికి సమ

ముగ నుండును. గుగ్గిలము మెత్తగను జిగురుగను ఉండును. శ్రేష్ఠమైన గుగ్గిలము నిప్పులోవైచిన మండును. ఎండలో నుంచిన కరగును. గోరువెచ్చని నీటిలోవైచిన ద్రవమగుటయే గాక పాలవలె తెల్లగానగును. గుగ్గిలముయొక్క సారము మూడునెలలకు తగ్గిపోవును. గుగ్గిలము మలమూత్రముల వెడలించును. గడ్డలను కంతులను కరగించును. నీటితోనూరి పట్టువేసిన వాతనొప్పులు తగ్గును. దీనినిపొగవేసి ధూమపానము చేయించిన శిరోరోగములు తగ్గును. చర్మవ్యాధు లన్నిటికి తదితరమందులలో కలిపివాడిన పనిచేయును. బలవర్ధకౌషధములలో కలిపి వాడవచ్చును. పండ్లపొడిలో దీనినివేసి వాడవచ్చును. మోతాదు:- ౩ తులములవరకు.

## —♦ చింత (Tamarind tree) ♦—

శ్లో॥ అమ్లికా చుక్రికా చించా తింత్రిణీ శుక్తిచంద్రికా.
టీ॥ అమ్లికా-చుక్రికా-చించా-తింత్రిణీ- శుక్తిచంద్రికా అనునవి చింత పేర్లు.

చింతచెట్టు పెద్దవృక్షము. పసిద్ధమైనది. దీని లేతఆకులు కాయలు- పండు పుల్లగానుండును. వేడిజేయును. చింతాకుపసరులో ఉప్పు, ఆముదపుపప్పు కలిపి చర్మరోగములకు వాడవచ్చును. ఆకుతొక్కి ఆముదముతో వేయించి బెణుకులకు మలిమిడికి వాడవచ్చును. చింతగింజలను రుబ్బి విరిగిన ఎముకలకు గుడ్డతో కట్టు కట్టవచ్చును. చింతచెక్కను మసిచేసి ఆముదములోగాని వేపనూనెలోగాని కలిపి చెల్తి, గజ్జి, నుసి

మిరికి వాడిన తగ్గును. చింతపండు చలువచేయును. పశువులకు కలుగు జీర్ణ, వాత, రక్తరోగములలో చక్కగా పనిచేయును. విషములకు విరుగుడు పెట్టవచ్చును. పైత్యపుదద్దురునకు చేమ జీలకర్రతో ఈపులుసు కలిపి మర్ధనచేయవచ్చును. మలబద్ధకముగానున్నపుడు చింతపండుపులుసుతో ఉప్పుకలిపి పెట్టిన పారును. ఉంగిడికి పులుసు పనిచేయును.

మోతాదు:--చింతపండు అర్ధసేరు నవటాకువరకు

## —♦ చిత్రమూలము (Plumbago Zeylanicum) ♦—

శ్లో॥ చిత్రకో హుతభుగ్వ్యాళో దారుణోదహనోరుణః,
అగ్నిమాలీ హవిః పాచీ వహ్నినామా విశేషతః.

టీ॥ చిత్రకః-హుతభుక్-వ్యాళః- దారుణః - దహనః - అరుణః
అగ్నిమాలీ-హవిఃపాచీ-వహ్నినామా అనునవి చిత్రమూలము పేర్లు.

దీనికి గుండ్రని ఆకులుండును. దీనివేరు చిదుకగొట్టిన యెడల పసుపుపచ్చగ నుండును. ఇది తెలుపు, ఎరుపు, నలుపు పువ్వుల భేదముచేనుండును. అల్పముగ దొరకును. ఎరుపు,నలుపు చిత్రమూలములు రెండు ఒకేగుణము కలిగియుండును. నలుపు చిత్రమూలమును ఆవులకు వాసనజూపినను లేక పాలలో వేసినను పాలు నల్లబడును. మలిమిడికి, బెణుకులకు చిత్రమూలముతో ఆముదముకలిపివేసిన పుండుపడి తగ్గును. దీనిరసము పొక్కును కాబట్టి తదితరమందులతో కలిపి లోపలికి ఈయవలెను. దీర్ఘజీర్ణరోగములకు దీనిరసముతో తదితరమందులు కలిపి

యిచ్చిన తగ్గును. బలవర్థకౌషధములలో కలిపి ఈయవచ్చును.
మోతాదు:- చిత్రమూలము 1 తులమువరకు.

## —♦ చేదుబీర (Plucketiana) ♦—

శ్లో॥ కోశాతకీశతచ్ఛిద్రా జాలినీ కృతవేధనా।
మృదంగఫలకాక్ష్వేళా ఘోంటకీ కర్కశచ్ఛదా॥

టీ॥ కోశాతకీ-శతచ్ఛిద్రా-జాలినీ-కృతవేధనా
మృదంగఫలకా-క్ష్వేళా-ఘోంటకీ- కర్కశచ్ఛదా అనునవి
చేదుబీర పేర్లు.

మంచిబీరవలెనుండును. రసము చేదుగ వెగటుగ నుండును. నరములకు సత్తువజేయును. తలతిరుగుడు, ధనుర్వాతము, దొమ్మ మొదలగు వ్యాధులకు యీపసరుపెట్టిన బాగుగా పని చేయును. మోతాదు:- పసరు అర్ధసేరువరకు.

## —♦ చేదుపొట్ల (Trichosanthes Cucumerina) ♦—

శ్లో॥ తిక్తోత్తమా బీజగర్భా పరా రాజపటోలికా,
జ్యోత్స్నపటోలికా జాలీ నాదేయీ భూమిజంబుకా.

టీ॥ తిక్తోత్తమా-బీజగర్భా-రాజపటోలికా-
జ్యోత్స్న- పటోలికా- జాలీ నాదేయీ - భూమిజంబుకా
అనునవి చేదుపొట్లపేర్లు.

తీగపాకును. ఆకులు పొట్లఆకులవలె నుండక చీళ్ళలు వేయును. కాయలు గుండ్రముగ చిన్నవిగ నుండును. పండిన

వెనుక ఎరుపుగా నుండును. కాయపైన తెలుపుచార లుండును. ఆకురసము వగరుగా చేదుగా నుండును. రక్తసంబంధమగు రోగములకు ఆకుపసరు బాగుగా పనిచేయును. చర్మవ్యాధులకు పసరును వాడవచ్చును. క్రిమిరోగములకు దీని పసరుతో కలిసీరు కలిపి ఈయవచ్చును.

మోతాదు:- పసరు అర్ధసేరువరకు.

## —♦ శేఫాలిక (A Medicinal plant) ♦—

దీనినే సేగుర్తాకు అందురు. ఇవి పొలములందును, దొడ్లలోను పెరుగులతలు. దీనిఆకు కందిచెట్టుఆకువలె నుండును. వాతరోగములకు బాగుగా పనిచేయును. జొన్నకలితో ఈ ఆకు పసరు కలిపి పక్షముదినములు పెట్టిన వాతము హరించును.

మోతాదు:- ఆకు వీసెనుంచి అర్ధమణుగువరకు.

## —♦ చాగనారమట్టలు (Sanseviera) ♦—

దీని దుంపరసము చేదుగా వెగటుగా నుండును. వేడి జేయును. ఈ మట్టలనుకాల్చి రసముతీసి దానిలో పసుపు మిరియాలపొడికలిపి కుడితిలో కలిపిపెట్టిన పాలసేర్లు తగ్గును. ఇంకను దీనిమట్టను ఉడికించి రసముతీసి చెవిలోపోసిన నొప్పి తగ్గును.

## —♦ చిక్కుడు (Dolichos Lablab) ♦—

చిక్కుడాకుపసరులో విభూతి కలిపి చన్నులు పగిలిన వాటికి నాలుగుదినములు వరుసగా రాసినయెడల గారపట్టును.

ఆకుపసరు వెన్నుభాగమంతటికిరాసి వేడినీరు కొట్టినయెడల పాలను వెంటనే చేపును. ఇదియొక మంచిసూత్రము. నాలుగైదురోజులు చేయవలెను.

—♦ జీలకఱ్ఱ (Cuminum Cyminum) ♦—

శ్లో॥ జీరకందీర్ఘకం శుక్ల మజాజీకణజీరకం.

టీ: - జీరకం-దీర్ఘకం-శుక్లం - అజాజీ కణజీరకం అనునవి తెల్లజీలకర్ర పేర్లు.

శ్లో॥ పృథ్వీకా సుష లీ పృథ్వీస్థూలజాజ్యుపకారికా.

టీ: - పృథ్వీకా-సుషలీ - పృథ్వీ - స్థూలజాజీ - ఉపకారికా అనునవి పెద్దజీలకఱ్ఱ పేర్లు.

ఇది చిన్నమొక్క - దీని కొనలయందు గుత్తులు గుత్తులుగ పూచి పువ్వుగుత్తులలో గింజ లేర్పడును. దీనినే తెల్లజీలకర్ర అందురు. మామూలుగా గృహములందు వాడు జీలకర్ర యిదియే. దీనిరసము పుల్లగా స్వాదుగానుండును. వేడిజేయును. జఠరదీప్తిని కలిగించును. రక్త, జీర్ణ, వాతరోగముల కన్నిటికి అమోఘముగా పనిచేయును.

మోతాదు: - 4 తులములవరకు.

—♦ జీడిగింజలు (Semecarpus) ♦—

శ్లో॥ భల్లాతకోనభో భల్లీ వీరవృక్షోగ్నివక్రకః,
ఆరుష్కర స్తథారూక్ష స్తపనోగ్నిముఖీధనుః.

టీ:- భల్లాతకః - నభోభల్లీ - వీరవృక్షః - అగ్నివక్త్రకః - ఆరుష్కరః - రూక్షః - తపనః - అగ్నిముఖి - ధనః అనునవి జీడి పేర్లు.

ఇది పెద్దవృక్షము. కొంచెము పొడవుగా వెడల్పుగా ఆకులుండును. నలుపుగింజలు, గుండ్రనిపండ్లు, తెలుపుగల మాను గలిగియుండును.

జీడిగింజలను నలుగగొట్టునపుడు జాగ్రత్తగా కొట్టవలెను. గింజలలోనుండు పొగ మనుష్యులకు సరిపడనిచో శరీరమంతయు వాచును. జీడిగింజలు వెగటుగ, చేదుగ చమురు గలిగియుండును. పశువులకు వాత రోగములకు ప్రతి దినము నాలుగైదు తీసికొని తిను ఆహారములో కలిపిపెట్టిన నెమ్మదించును. పాడిపశువులకు పాలసేర్లు నాలుక సెలయగునప్పుడు ఈ గింజలను పులిచల్లలో నానబెట్టి త్రాగించిన నెమ్మదియగును. కాలుగొట్టు, తదితర మొండిగాయములకు జీడిని కాల్చి అంటించిన తగ్గును.

## —♦ జటామాంసి (Valeriana Jatamansi) ♦—

ఇదియొక గ్రంథిదినుసు. చిరుచేదుగ సువాసనగనుండును. విరేచనము గావించును. చలువచేయును. రక్తమును శుభ్రపరచును. వాతజీర్ణరోగములకు బాగుగాపనిచేయును.

మోతాదు:- 2 తులములవరకు

## —♦ జిల్లేడు (Asclepias Gigantea) ♦—

శ్లో॥ అర్కస్సూర్యాహ్వయః క్షీరీ సదాపుష్పోవికీరణః

టీ॥ అర్కః-సూర్యాహ్వయః-క్షీరీ-సదాపుష్పః - వికీరణః- అను నవి జిల్లేడు పేర్లు.

దీనిలో తెలుపు నలుపు రంగుల పువ్వులుగల చెట్లుండును. జిల్లేడు చిన్నచెట్టు, దీనికాయలు వంకరగ ఆకుపచ్చగ నుండును. ఎండినతరువాత కాయలోనుండి స్వచ్ఛమైన మృదువైనదూది వెడలును. చెట్టు నెచ్చట గిల్లినను పాలుగారును. పాలకు మదపువాసన యుండును. తెల్లజిల్లేడు పూవులు శివునికి ప్రీతికరములని పూజచేయుదురు. ఆకులుమందముగ కొంచెము కోలగనుండును. చెట్టంతటను సన్నని తెల్లని నూగుండును. ఇది ప్రసిద్ధమైనచెట్టు. రెండుజిల్లేళ్లును సమాన ప్రభావముగలవి గాని, తెల్లజిల్లేడు మిగులశ్రేష్టము.

ఆకులు, వేళ్ళు, పూవులు, పాలును సయితము వెగటుగానుండును. చాల వేడిగలిగించును. విరేచనముకూడచేయును. జిల్లేడాకుల రసము వాపులకు శ్వాసరోగములకు చెవిరోగములకు పనిచేయును. జిల్లేడుపాలు నేత్రరోగములకు చర్మరోగములకు పనిచేయును. ఆకుపసరు విషపురుగుల కాట్లకు పనిచేయును.

## —♦ జమ్మి (Mimosa Suma) ♦—

శ్లో॥ శమీతుంగా శంకుఫలా పవిత్రా కేశహృత్ఫలా.

టీ॥ శమీ-తుంగా-శంకుఫలా-పవిత్రా- కేశహృత్ఫలా అనునవి జమ్మి పేర్లు.

ఇది సాధారణమైనచెట్టు. చింతాకులకంటె మిక్కిలి

సన్నని ఆకులు, వానపాములవలె సన్నగా పొడవైన కాయ లుండును. కాయలు రుచిగానుండును. దీని ఆకులు తుమ్మాకుల వలెనుండును. ఆకు చెక్కరసము వేడిజేయును. ఆకుపసరు వాత రోగములకు చర్మరోగములకు పనిచేయును.

## —• తుమ్మ (Acacia Arabica) •—

ఇదియొక పెద్దచెట్టు కొమ్మలకు సన్నని ముండ్లుండును. పసుపుపచ్చగను గుండ్రముగనుండు చిన్నపువ్వులు పూయును. పూవునకు అరంగుళము పొడవుగల సన్ననితొడిమయు, నలుపుగ, మందముగనుండు మ్రాను పైపట్టయు, తెలుపు, నలుపు రంగులుగల జిగురును, సన్ననిపొడవుగ పలుచగనుండు కాయలును, జమ్మియాకులవలె చిన్నవిగను ఉండును. ఇందు తెల్ల తుమ్మ, నల్లతుమ్మ, కస్తూరితుమ్మ అని మూడురకములుగలవు. తెల్లతుమ్మమాను అంతయు తెలుపుగ బూడిదరంగుగ నుండును. పూవులుకూడ తెలుపుగనుండును. కస్తూరితుమ్మ సాధారణమైనచెట్టు. ఇంచుమించు తెల్లతుమ్మవలెనుండును దీనికాయ మిక్కిలిపొట్టిది. నల్లతుమ్మచెక్క వగరుగ వెగటుగ నుండును. ఈ చెక్కరసము, పొరుడు నోటిగాలిపుండ్లు మొదలగువానికి పనిచేయును. చిన్నదూడలకు కలుగు చర్మవ్యాధులకు పనిచేయును. పాలసేర్లు, గర్భవాతమునకు, పశువు ఈనిన తరువాతను సేరుతుమ్మాకు పసరులో అర్ధసేరుపాలు, రెండు తులముల ఇంగువకలిపి త్రాగించినతగ్గును. తుమ్మచెక్క పొడిచేసి రసి గారుపుండ్లకు తదితరగాయములకు బాగుగా పనిచేయును.

తుమ్మచెక్క కషాయము నోటిపూతకు పనిచేయును. తుమ్మ కాయలను పశువులకు పెట్టిన మిగులబలముగలిగించును.

మోతాదు:- చెక్కరసము అర్ధసేరువరకు.

## —♦ తురకవేప (Melia Azodirachta) ♦—

శ్లో॥ కిరాతకో నైపాలో నాడితిక్తో జ్వరాంతకః ।
కండు తిక్తోర్ధతి క్తస్స్యాన్నిదారి రిస్సన్నిపాతహా ॥

టీ॥ నైపాలః-నాడితిక్తః-జ్వరాంతకః-కండుతిక్తః
నిదారిః-సన్నిపాతహా అనునవి తురకవేప పేర్లు.

దీని ఆకులు వేపాకులకంటె పెద్దవిగనుండును. ఆకు రసము చేదుగనుండును. దీనివేరు గింజలను మందులలోవాడుదురు. దీనిచెక్కరసము చేదుగనుండును. ఆకురసము విషమును విరచును. మలమూత్రములజారీచేయును. చర్మవాతరోగములకు బాగుగాపనిచేయును. నీటిలో తురకవేపాకువేసి కాచి గోరువెచ్చగానుండునీటిని పశువులకుకలుగు వాతనొప్పులు, దెబ్బలు వాపులుమున్నగువానికి దినమునకు నాలుగైదుసార్లు కట్టిన యెడల బాగుగాపనిచేయును. ఆకుపసరులో ముద్దకర్పూరం కలిపి చెల్దికి, గజ్జికి రాచినతగ్గును. దూడలకు మిన్నల్లులు పట్టినపుడు ఈ ఆకుపసరులో మంచినూనెకలిపి దూడకురాసిన అవి చచ్చిపోవును.

మోతాదు:- ఆకురసము ముప్పాతికసేరువరకు.

## —♦ తులసి (Ocimum vilosum) ♦—

శ్లో॥ తులసీసురసాగౌరీ భూతఘ్నీబహుమఞ్జరీ.

టీ॥ తులసీ- సురసా- గౌరీ- భూతఘ్నీ - బహుమంజరీ అనునవి తులసిపేర్లు.

తులసి గుండ్రముగ కొంచెము కోలగ మృదువైన ఆకులుండును. కృష్ణతులసి, లక్ష్మీతులసియని రెండురకములు. కృష్ణతులసియాకులు నలుపుగను, లక్ష్మీతులసియాకులు పచ్చగ నుండును. తక్కినవి సమానములు. వీని శిఖలందు వెన్ను బుట్టును. ఇందు సన్నని పువ్వులును, నలుపుగనుండు చిన్నగింజ లునుఉండును. తులసిమంచి సువాసనగలది. గృహస్థులు పరమ పూజ్యముగనెంచి గృహములందు వేసి పూజించుదురు.

తులసి కారముగ వగరుగనుండును; వేడిజేయును. శ్వాస, రక్తరోగములకు, బాగుగా వాడవచ్చును ఆకుపసరును మొగ బంతి పీనసరోగములకు ముక్కురంధ్రములలో వేయవచ్చును. చర్మరోగములలో పసరుతో గంధకము, హారతికర్పూరము కలిపి వాడినతగ్గును. ఆకునూరి దానిలో తగినంత కరిధూపము కలిపి పురుగులుపడిన పుండ్లకు వేసిన పురుగులు చచ్చును.

మోతాదు:- ఆకుపసరు పావు సేరువరకు.

## —♦ తమలపాకులు (Betel leaves) ♦—

శ్లో॥ తాంబూలవల్లీ తాంబూలీనాగినీ నాగవల్లరీ॥

టీ॥ తాంబూలవల్లీ- తాంబూలీ- నాగినీ-నాగవల్లరీ అనునవి తమలపాకుపేర్లు.

తమలపాకుతీగ సన్నముగనుండును. దీనికి చెమ్మయు, చల్లదనము యుండవలయును. తీగ నరికి పాతిన బ్రతుకును.

ఆకులలో మూడునాలుగు రకములుగలవు. దీని ఆకురసము కారముగ నుండును. విరేచనము గావించును. వాతరోగములలోను, కడుపునొప్పి, రొంప, దగ్గు మున్నగు రోగములలోను ఆకుపసరు బాగుగా పనిచేయును.

మోతాదు:- ఆకులు 100 వరకు.

—♦ తుత్తురుబెండ (Malya Rotandifolia) ♦—

దీని ఆకులను నీటిలోవేసి కాచినయెడల జిగురువంటి పదార్థమువచ్చును. ఆకు గాయములకు, వాపులకు పనిచేయును. జీర్ణరోగములకు ఈ ఆకురసము పనిచేయును.

మోతాదు:- పసరు పావుసేరువరకు.

—♦ తంటెపు చెట్టు (Cassia tora) ♦—

దీనినే తగిరిసచెట్టందురు. ఆకు కోలగ గుండ్రముగ కొసదేలియుండును. పసుపుపచ్చని పువ్వులుపూయును. కాయలు కొద్దిగ వంకరగ పలుచగ పొడవుగ సన్నముగ నుండును. ఆకును త్రొక్కి నొప్పిగలభాగములకువేసిన తగ్గును. చలువ చేయును. విరిగినభాగములు పోటుగానున్నపుడు ఈ ఆకును కట్టిన బాధ తగ్గును.

—♦ తంగేడు (Cassia Auriculata) ♦—

గుబురుగాపెరుగును. పసుపుపచ్చని పూవులు పూచును. కాయ వంకరగ బద్దవలెనుండును. ఆకు చింతాకుకన్న రెట్టింపు పెద్దదిగ నుండును. చెక్కరసము వగరుగనుండును. ఆకురసము చెక్కరసము విరేచనములుకట్టించుటకు పనిచేయును. దూడలు

పా లెక్కువగా త్రాగి పారుకొనిన యెడల తంగేడు చిగుళ్ళను పెరుగులోకలిపిపెట్టిన తగ్గును. పెద్దరోగములో పారు డెక్కువగా నున్నయెడల ఆకు చిగుళ్ళను నూరి కలినీటిలోగాని పెరుగులోగాని నాలుగైదు సార్లు పెట్టినయెడల తగ్గును.

మోతాదు:-- ఆకుపసరు అర్ధసేరువరకు.

## —• తిప్పతీగ (Tinosqora Cordifolia) •—

శ్లో॥ గుడూచీ కుండలీ ఛిన్నా వయస్థామృతవల్లరీ
ఛిన్నోద్భవా ఛిన్నరుహా మృతాజ్వరవినాశినీ
వత్సాదనీ చంద్రహాసా జీవంతీ చక్రలక్షణా.

టీ॥ గుడూచీ-కుండలీ-ఛిన్నా-వయస్థా - అమృతవల్లరీ - ఛిన్నోద్భవా-ఛిన్నరుహా - అమృతా - జ్వరవినాశినీ- వత్సాదనీ - చంద్రహాసా-జీవంతీ-చక్రలక్షణా అనునవి తిప్పతీగ పేర్లు.

ఇది యొకవిధమైన తీగ. డొంకలమీదను కంచెలమీదను పాకును. దీనియాకులు యించుమించుగ తమలపాకును పోలియుండును. ఈతీగ గణుపులలో రెండువైపుల చిగురుపట్టి పెద్దతీగగా పెరుగును. దీనికి చిన్నచిన్న తెల్లనిపూవులును, బచ్చలకాయలవంటికాయలును ఉండును. పండ్లు నలుపు రంగుగా నుండును. రామరావణయుద్ధములో మృతులైన కపీశ్వరులను బ్రతికించుటకై దేవతలు వారిశరీరముల చల్లిన అమృతబిందువులు పడినచోట నీ తీగ మొలచిన దనియందురు. వేపచెట్లమీదకు పాకుతీగెలు మంచివందురు. ఈ తీగెనుండి సత్తు తయారుచేయుదురు. తీగెరసము వేడిజేయును. కార

ముగ, వగరుగ చేదుగనుండును. ఈ తీగెను పలుపుగాచుట్టి కురమతగిలిన పశువుమెడలోవేసిన రోగముతగ్గును. ఇంకను వాతరోగములకు ఈ పసరు పనిచేయును. ఇంకను ఆకురసము గాయములకు చర్మవ్యాధులకు, నరములు తెగినప్పుడు వాడిన పనిచేయును. మోతాదు:- తీగెరసము సేరువరకు.

## —♦ తవాక్షరి (Bamboo manna) ♦—

శ్లో॥ వంశజావైణవీ క్షీరీత్వక్ క్షీరీవంశరోచనా,
తుగాక్షీరీతుగావంశీవంశక్షీరీ శుభాసితా.

టీ॥ వంశజా-వైణవీ-క్షీరీ-త్వక్ క్షీరీ-వంశరోచనా,
తుగా-వంశీ-వంశక్షీరీ- శుభా-సితా- అనునవి తవాక్షరిపేర్లు.

వెదురుబొంగులను చీల్చినపుడు తెలుపురంగుగల పలుకు కొన్నిటిలో బయలుదేరును. దీనినే తవాక్షరియందురు. వెగటుగా వగరుగానుండును. మూత్రరోగములలో దీనిని వాడవచ్చును. విరేచనముల కట్టించును. శుక్లనష్టము కలిగినపుడు మంచిగంధముతో దీనిని యిచ్చినచో తగ్గును.

మోతాదు:- 3 తులములవరకు.

## —♦ తాటిచాప ♦—

తాటిపండ్ల గుజ్జుచే తయారుచేయబడును. దీనిని నీటిలోగాని కుడితిలోగాని కలిపి పాడిపశువులకు త్రాగించిన పాలెక్కువయిచ్చును. వెన్న గట్టిగానుండును. తగినంతగనే పెట్టవలెను. ఎక్కువగా పెట్టినయెడల వాతముజేయును.

## —♦ తెలికపిండి (Oil cake) ♦—

ఇది నువ్వులనూనె తీయగా మిగిలినపిప్పి పాడిపశువులకు పెట్టిన పాలెక్కువగానిచ్చును, వాతరోగముగల పశువులకు పెట్టిన వాతముహరించును. నిక్కాకగలపశువులకు పెట్టరాదు. ఇది వంటినీరు తీయును. రక్తముపట్టును. మానవులు కూరగా వండుకొందురు. పశువులకు కలుగు రొప్పునకు తెలికపిండి పాలలో నానవేసి వారముదినములు పెట్టిన తగ్గును.

మాత్రాదు:- సవాసేరునుంచి 1 వీసెవరకు.

## —♦ త్రిఫలములు ♦—

(Cheboulic, Belleric and Emblic Myrabalams)

కరక్కాయ, తాడికాయ, ఉసిరికాయ అనువాటిని త్రిఫలములందురు. మూడుపాళ్ళు కరక్కాయలు, ఎనిమిదిపాళ్లు తాడికాయలు, పన్నెండుపాళ్లు ఉసిరికాయలు కలిపినచూర్ణము సమస్త రక్త జీర్ణ వాత నేత్ర రోగములకు బాగుగా పని చేయును. శిరోరోగముల పోగొట్టును. దొమ్మలను రూపు మాపును.

## ♦త్రికటుకములు(Pepper, dry ginger and long pepper)♦

సొంటి పిప్పళ్లు మిరియాలు అనువాటిని త్రికటుకము లందురు. ఇవి శ్వాస, పీనసరోగములకును, రక్తజీర్ణ వాతరోగ ములకును బాగుగాపనిచేయును. త్రికటుకములను మెత్తగా నూరి వస్త్రఘూళితముబట్టి వెన్నలోగాని, తేనెలోగాని కలిపి నేత్రరోగములకు పెట్టినబాగుగాపనిచేయును. త్రికటుకములు జీర్ణశక్తిని గలిగించును. వేడిజేయును.

## —♦ తాడికాయ (Terminalia Bellirica) ♦—

శ్లో॥ విభీతకః కర్షఫలో భూతావాసః కలిద్రుమః ।
వాసంతో౽క్షో వృద్ధజాతస్సంవర్తస్తిలపుష్పకః ॥

టీ॥ విభీతకః-కర్షఫలః-భూతావాసః-కలిద్రుమః
వాసంతః-అక్షః-వృద్ధజాతః-సంవర్తః-తిలపుష్పః - అనునవి తాడికాయ లేక తానికాయ పేర్లు.

ఇది బజారుకొట్లలో దొరకువస్తువు. ఈ కాయరసము చలువచేయును. ఆర్చును. పశువులకు కలుగు రక్త, వాత, జీర్ణ నేత్రరోగములకు బాగుగాపనిచేయును. వగరుగ రుచిగ నుండును. దీనిగంధమును చర్మవ్యాధులకు వాడవచ్చును. రసిగారు పుండ్లకు ఈ పొడి మసిబొగ్గుతో కలిపిజల్లిన పనిచేయును.

మోతాదు:- కాయలపొడి $2\frac{1}{2}$ తులములవరకు.

## —♦ తాళిసపత్రి (Pinus webbiana) ♦—

శ్లో॥ తాలీసపత్రం తాలీసంధాత్రీపత్రం సకోదనం
అపరంగ్రంధికాపత్రంపతాత్రిఘ్యంతులసీచ్ఛదం.

టీ: - తాళీసపత్రం - తాళీసం - ధాత్రీపత్రం - సకోదనం గ్రంధికాపత్రం - పతాత్రిఘ్యం - అనునవి తాళిసపత్రి పేర్లు.

ఈచెట్లు కొండలమీద పెరుగును. తోటలలో దీనిని తరచుగా పనసపోక చెట్లతోకలిపి పెంచుదురు. దీనివిత్తనములు, జల్లిన అయిదు సంవత్సరములకు మొక్కలనుదీసి దూరదూరముగా పాతుదురు. పదిసంవత్సరములకు ఫలితమునకువచ్చును. ఈచెట్టు ఎండిన తుంగవలెనుండును. ఆకులు అంత వెడల్పుగా

నుండక ఆకు జెముడాకువలె నుండును. పశువులకు కలుగు శ్వాసరోగములకు, వాపులకు బాగుగా పనిచేయును.

మోతాదు:- ప్రతి 3 తులములవరకు.

### తాటిబెల్లము (Jaggery made by Palmyra toddy)

దీనిని తాటికల్లుతో తయారుచేయుదురు. చలువచేయును. ఈబెల్లము సున్నపుకల్లుతో తయారు చేయుదురు. పోతు తాటిబెల్లము చాల శ్రేష్ఠము. దీనినుంచి సారాయి కూడ తీయుదురు. పశువులకుపెట్టు బలవర్ధకౌషధములలో కలిపి పెట్టవచ్చును. కాకరోగములకు, మూత్రరోగములకు బాగుగా పనిచేయును.

### తాబేలు

రెండుసేర్ల మజ్జిగలో తాబేలునువేసి ఒకదినము నిలువయుంచి మరునాడు ఆమజ్జిగను పశువులకుకలుగు రొప్పు, కసి, మిరి, దగ్గు మొదలగు వ్యాధులకు వారముదినములు వరుసగా పెట్టిన శాంతించును.

### తేనె (Honey)

శ్లో॥ మధు పుష్పాసవః పుష్పరసోమాక్షిక మీరితమ్.

టీ॥ మధు-పుష్పాసవః-పుష్పరసః-మాక్షికం-అనునవి తేనెపేర్లు.

తేనెలో నాలుగురకములు గలవు. భ్రామరము, పైత్తికము, క్షౌద్రము, మాక్షికములని నాలుగు విధములు. భ్రామరము తెలుపుగ నెయ్యిరంగుగలదిగ నుండును. క్షౌద్రము కపిల రంగుగనుండును. మాక్షికము తైలవర్ణముగ నుండును.

భ్రామరమను తేనె తృప్తినిచ్చును. తీయగనుండును. పైత్తిక మను తేనె త్రిదోషముల ప్రకోపింపజేయును. క్షౌద్రమను తేనె గురుత్వము కలదిగనుండి శ్లేష్మమును పెంచును. శ్లేష్మమైనది. మాక్షికమను తేనె రూక్షగుణము స్వల్పమగుగురుత్వముగలది. మధురముగనుండును. వాతమును పెంచును. వ్రణచికిత్సయందు ఉత్తమముగనుండును. కొత్త తేనె అల్పగుణములను బహు దోషములను గలిగియుండును. కాచివడియగట్టిన తేనె త్రిదోష హరముగను, పచ్చి తేనె పులుపుగ త్రిదోషకారిగను నుండును. విషపుష్పములనుండిగూడ తేనెను తేనెటీగలు చేర్చును. గాన తేనెను ఉష్ణముగ నుండునపుడుగాని, ఉష్ణముగనుండు పదార్థ ములలో కలిపిగాని వాడరాదు. అట్లు చేసినచో విషసమముగ నుండును గాన లేహ్యములందును, బలవర్థ కౌషధములలోను వాడవలసి వచ్చినపుడు చల్లార్చి వాడవలెను.

## ధనియాలు (Coriander Seeds)

ఆకు నల్లివాసనగ నుండును. చిల్లలుచిల్లలుగల మృదు వైన ఆకులును, గుత్తులుగుత్తులుగ తెలుపుగ చిన్నవిగనుండు పువ్వులును ఉండును. గింజలు గుండ్రముగ పరిమళముగ పచ్చిగ నున్నపు డాకుపచ్చరంగు, ఎండినపిదప గోధుమవర్ణము కలవిగ నుండును. ధనియపు మొక్కలకు కొత్తిమిరి మొక్కలని పేరు. సోపుగింజలవలెనే ఇవియునుపనిచేయును. పశువులకు కలుగు అజీర్తి కడుపునొప్పి మొదలగు జీర్ణరోగములకును, బలవర్థ కౌషధములలో, వాయువును పోగొట్టుఔషధములలో కలిపి

వాడుదురు. ఇవి తీపిగ, వగరుగనుండును. ధనియాలరసములో శేవల్పిన్నిరసముకలిపియిచ్చిన నీరు చురుకుతగ్గును.

మోతాదు:- ధనియాలు అర్ధసేరువరకు.

## —♦ దాణాదినుసులు ♦—

సామాన్యమేతకంటె నెక్కువసారముగలిగి కొంచెము కొంచెముగా పశువులకు పెట్టబడు దినుసులు దాణాదినుసు లన బడును. ఉలవలు, తెలికపిండి, కాయధాన్యములు, పిండిజాతులు ధాన్యములు, పొట్టులు మొదలగునవి. పశువులు ఆరోగ్యముగా నుండుటకును, బలిష్టముగనుండుటకును వానికాహారము తగినంత పెట్టుటయేగాక, ఆయాహారము శరీరపోషణకుదగినదిగా నుండ వలెను. పశువులకు బెట్టు ఆహారమునందు విలువైనద్రవ్యములు, చమురు, అల్బ్యుమినియంలు, ద్రావణీయకర్బనోజ్జనితములు, నార, బూడిద, మొదలగుపదార్థములుండును. నార అజీర్ణ పదార్థమైనను దీనినిగూడ పశువులు కొంతవరకు జీర్ణము చేసి కొనగలుగుటచేత కొంతవిలువగల దగుచున్నది. తక్కినద్రవ్య ములు కూడ పూర్తిగ జీర్ణముకాకపోయినను చాల భాగము జీర్ణమగును.

## —♦ దాల్చినచెక్క (Cinnamon) ♦—

ఈచెట్లను మన దేశమునందంతగా పెంచుటలేదు. ఇవి పడమటికనుమలమీాద ఎక్కువగా పెరుగుచున్నవి. ఇవి ఆరేండ్లు పెరిగిన తరువాత బెరడు తీయవచ్చును. ఇది సామాన్యముగా బజారులలో దొరకును. ఇందులో రెండురకములు గలవు. చెట్ల

లోపల చిన్న చిన్న చుట్టలుగలిగి యుండునది మంచిరకము. ఇది సువాసనగను, తీపిగను, వగరుగను ఉండును. ఇది మంచి జీర్ణకారి. పశువులకు కలుగు వాతరోగము పారుడు దొమ్మ కడుపునొప్పి మొదలగు వ్యాధులకు బాగుగా పనిచేయును.

మోతాదు:- చెక్కపొడి 2½ తులములవరకు

## —♦ దానిమ్మ (Punica Granatum) ♦—

శ్లో॥ దాడిమీ రక్తకుసుమా దంతబీజా శుకప్రియా,
మధురామ్లఫలో రక్తబీజకో రక్తపూరకః.

టీ॥ దాడిమీ-రక్తకుసుమా-దంతబీజా-శుకప్రియా-మధురామ్ల ఫలః-రక్తబీజకః-రక్తపూరకః-అనునవి దానిమ్మపేర్లు.

తియ్యదానిమ్మ, పులుపుతీపు కలసినదానిమ్మ, పులుపు దానిమ్మయని మూడురకములుగలవు. దీని మ్రానుచెక్క, వేరుచెక్క, ఆకు మొగ్గ పువ్వు లేతచిగుళ్లు తొక్క వీనిరసము వగరుగనుండును. పారుడు రక్తవిరేచనములలో ఈచెక్కరసముగాని లేత ఆకులనుగాని పెరుగుతో కలిపి మూడునాలుగు పర్యాయములు పెట్టినతగ్గును. ఈనినతరువాత మానము వెంట దుర్వాసనగల మష్టుపడుచుండినయెడల ఈచెక్కరసముతో కడిగిన వాసనతగ్గును. ఇంకను ఈచెక్కపొడి పుండ్లు గారపట్టుటకు ఉపయోగించవచ్చును.

## —♦ దిరిసెన (Mimosa Sirissa) ♦—

శ్లో॥ శిరీషః ప్లవగోవిప్రశ్శుకవృక్షః కపీతనః,
మృదుపుష్పశ్శ్యామవర్ణో భండీరశ్శంఖినీఫలః.

టీ:- శిరీషః - ప్లవగః - విప్రః - శుకవృక్షః - కపీతనః - మృదుపుష్పః - శ్యామవర్ణః - భండీరః - శంభినీఫలః - అనునవి దిరిసెన పేర్లు.

ఇది పెద్దవృక్షము. దీనికొమ్మలు పెళుసైనవి. ఈ చెట్టు శాఖోపశాఖలుగా పెరుగుటచే పందిరివలె ఛాయా ప్రధానముగాకూడ ఉపయోగపడును. కాయలు పలుచగా బద్దలవలె పొడువుగను, పూవులు కేసరములవలె నుండును గాని అంతకంటె కొంచెము పెద్దవి. పూవులకు కొంచెము పరిమళముండును. ఆకు మునగాకువలె నుండును గాని అంతకంటె కొంచెము పెద్దది. కాయలు 4 నుంచి 9 అంగుళములవరకు పొడవుండును. ఒక్కొక్క కాయలో పదిగింజలకంటె ఎక్కువ యుండవు. దీనిచెక్క ఆకురసము వెగటుగనుండును. వేడి జేయును. దీని వేరులను ఆకులరసమును వాత రోగములలో నుపయోగించు మందులలోకలిపి వాడుదురు. దిరిసెనాకుపసరు, నరమూత్రము, పసుపు, నల్లేరుకలిపి గుండెవగర్పు దగ్గులకు పెట్టిన తగ్గును. తెలియునిరోగములకు ఈ ఆకుపసరు, పసుపు కలిపిపెట్టిన తగ్గును. ఈ ఆకుపసరు రక్తసంబంధమగు రోగముల కన్నిటికి బాగుగా పనిచేయును.

మోతాదు:- ఆకు చెక్కరసము సేరువరకు.

—♦ దూసరి (Cocculus Villosus) ♦—

శ్లో॥ ఛిలిహింటో మహామూలః పాతాళగరుడాహ్వయః.

టీ॥ ఛిలిహింటః-మహామూలః- పాతాళగరుడాహ్వయః అనునవి దూసరితీగె పేర్లు.

ఇది తీగబ్రాకును. వేరు మిగుల గాఢముగ నాటుకొనును. ఆకులు కొంచెము కోలగ చిన్నవిగ మిక్కిలి ముదురు ఆకు పచ్చరంగు గలవిగనుండును. దీనికాయ చిన్నది. పచ్చిగనున్నపుడు ఆకుపచ్చరంగుగను పండిన తరువాత నలుపురంగుగనుండును. ఆకురసము చలువచేయును. విరేచనము కలిగించును. మూత్రమును వెడలించును. దూసరితీగెను త్రాడుగా చుట్టి పశువులకు కురమరోగము వచ్చినపుడు మెడలో వేసిన తగ్గును. పశువులకువచ్చు మూత్రరోగములలో ఈ ఆకు బాగుగా పనిచేయును.

మోతాదు:- ఆకురసం సేరువరకు.

—♦ దుష్టుపుచెట్టు (Odina Wodier) ♦—

ఇది తీగబ్రాకును. ఆకు గిల్లినను అమితముగా పాలుగారును. ఆకులు గుండ్రముగ కొనదేలియుండును. పూవులు గుత్తులుగా తెలుపుగ అందముగ నుండును. ఇది మిక్కిలి వేడి జేయును. విరేచనము గావించును. దొమ్మలు కురము మొదలగు రక్తసంబంధమగు వ్యాధులకు బాగుగా పనిచేయును. ఈ తీగను పలుపుగాచుట్టి చలికురము తగిలినదాని మెడలో వేసిన తీగ ఘాటునకు తీవ్రజ్వరముతగ్గును.

మోతాదు:- పసరు అర్ధసేరువరకు.

—♦ దొండ (Momordica Monadelpha) ♦—

శ్లో॥ బింబీరక్తఫలాగోళాతుండీ దంతచ్ఛదోపమా।
మధుపక్వా మహాద్రాక్షీ శ్లేష్మకృద్బోధనాశినీ ॥

టీ॥ బింబీ-రక్తఫలా-గోళా-తుండీ-దంతచ్ఛదోపమా
మధుపక్వా-మహాదార్ళీ-శ్లేష్మకృత్-బోధనాశినీ అనునవి దొండ పేర్లు.

దొండ తీగ జాతిని. చేదుదొండ, తీయదొండయని రెండువిధములు. ఇంకను కాకిదొండ, మురుదొండ, నాగదొండ అను రకములుకూడగలవు. తియ్యదొండ దొడ్లలో వేసి పెంచబడును. చేదుదొండ అరణ్యములలో స్వయముగా మొలచును. దొండతీగనరికి పాతినబ్రతుకును. దొండకాయలు కొంచెముకోలగ గుండ్రముగ సన్నగనుండును. పచ్చికాయలు ఆకుపచ్చగను పండినపుడు పగడమువంటి చక్కనిఎరుపురంగును కలిగియుండును. దొండాకు మూడుఅంచులుకలదై మృదువుగనుండును. తీయదొండకాయలను కూరవండుకొని తిందురు. ఆకురసము వేడిజేయును. ఆకుపసరును అర్రువాపులకు వెన్నలో కలిపిరాసిన బాగుగాపనిచేయును. శిరోవాతములకు ఆకు పసరును చెవులలోపోసిన తగ్గును. చర్మరోగములకు ఈ పసరుతో ముద్దకర్పూరము కలిపిరాసిన తగ్గును. తీయదొండాకు రసమును రక్తసంబంధమగు రోగములకు త్రాగించిన పని చేయును.

మోతాదు:- పసరు సేరున్నరవరకు.

## —♦ దోస (Cucumis Sativus) ♦—

ఇది తీగెజాతిలోనిది. ఇందు అనేకజాతులుగలవు. ఈకాయలు చలువచేయును. విరేచనముగావించును. పశువు

లకుకలుగు జీర్ణసంబంధమగు రోగములలో అనగా కడుపుబ్బ కడుపునొప్పి మున్నగు వ్యాధులలో నుపయోగించిన బాగుగా పనిచేయును. మూత్రరోగములలోకూడ దీనిని వాడవచ్చును.

—♦ నల్లేరు ♦—

శ్లో॥ అస్థిసంహారకో వజ్రవల్లరీ క్రోష్టుఘుంటికా,
వజ్రాంగీ గ్రంథిమాన్ వజ్రః ప్రోక్తస్స్యా దస్థిశృంఖలః.

టీ॥ అస్థిసంహారకః-వజ్రవల్లరీ-క్రోష్టుఘుంటికా-వజ్రాంగీ-గ్రంథిమాన్-వజ్రః-అస్థిశృంఖలః-అనునవి నల్లేరు పేర్లు.

డొంకలమీదను, చెట్లమీదను ప్రాకుతీగ నాలుగైదు అంగుళముల కొక కణుపును,కణుపువద్ద ఆకులును ఉండును. కాడ పలకలుగానుండును. ఇందు రెండుమూడు నాలుగు పలకలుగల కాడలుండును. మూడు పలకల నల్లేరు కొన్ని భస్మములు చేయుటకు వాదవిద్యయందుపయోగించుటకు పనికివచ్చును. నల్లేరు కాయలు పచ్చివి ఆకుపచ్చగ పండినవి నల్లగ గుండ్రముగ చిన్నవిగ కరివేప పండ్లంతయుండును. కాడలు మాత్రము ఔషధముగవాడనగును. దీనిరసము శరీరమునకు తగిలిన దురదపుట్టి దద్దురులేచును.

ఆకులు కాడలు దురదగలిగియుండును. వేడిజేయును. పశువులకు కలుగు ఉంగిడి విషపురుగులకాట్లు నల్లతెవులు ఎడతెగనిపారుడు మున్నగురోగములకు పనిచేయును.

మోతాదు:- నల్లేరురసము అర్ధసేరువరకు.

—♦ నల్లజీలకఱ్ఱ (Migella Sative) ♦—

ఈ మొక్కలు విస్తారముగా పంజాబు దేశమునందు

పెరుగును. వీనిఆకులు చీలియుండును. పువ్వులు గుత్తులుగుత్తులుగా నుండును. ఇవి నలుపుగ మిరమిర లాడుచుండును. చేతితో నలిపి వాసనజూచిన గాటుగల సువాసనవచ్చును. ఇవి కారముగనుండును. జీర్ణరోగములకు ఇవి బాగుగా పని చేయును. కడుపుబ్బు అజీర్తి మలబద్ధకములకు వీటిని ఉపయోగించవచ్చును.

మోతాదు:- 4 తులములవరకు.

## —♦ నల్లమందు (Opium) ♦—

ఇది గసగసాల మొక్కల కాయలనుండి తయారుచేయబడును. నల్లమందులో జారణము, మారణము, ధారణము, సారణము అని నాల్గువిధములు. జారణము తెలుపుగను, మారణము నలుపుగను, ధారణము పచ్చగను, సారణము చిత్రవర్ణముగను యుండును. ఇది విదేశీయమైన ఔషధము.

నల్లమందు చేదుగనుండును. మత్తును కలుగజేయును. మలమూత్రముల బంధించును. రక్తమును విరచును. పశువులకుకలుగు అతిసారము, రక్తాతిసారము, కడుపునొప్పి మొదలగు జీర్ణసంబంధమగు రోగములకు పనిచేయును. ఎండువాతముగల పశువునకు అర్ధసేరు ఆవుపాలలో ఒక అరతులముగాని పావుతులముగాని నల్లమందుకలిపి త్రాగించిన తగ్గును.

మోతాదు:- తులమువరకు.

## —♦ నల్లఉప్పి (Volkameria Inermis) ♦—

దీనివేరు ఆకులరసము చేదుగనుండును. ఉప్పిచెక్కరసము వాతరోగములకు బాగుగా పనిచేయును.

## —♦ నాచు ♦—

నిలువనీటిలో మొలచునట్టి యొకవిధమైన తుక్కు. ఇది అనేకరకములుగా నుండును. నీచువాసన కొట్టుచుండును. ఇది ఉప్పుగ చేదుగ తీపిగ నుండును. అరుగ్రివాపులకు, తదితర వాపులకు ఈ నాచునువేసి నాలుగైదు కట్లుకట్టిన తగ్గును. మంట నణచును.

## —♦ నీరుల్లి (Allium Cepa) ♦—

శ్లో॥ పలాండుర్ధవలాఖ్యశ్చ దుర్గంధో ముఖదూషకః.
టీ॥ పలాండుః- ధవలాఖ్యః- దుర్గంధః- ముఖదూషకః- అనునవి నీరుల్లి పేర్లు.

ఇదియొక దుంపజాతి. ఎరుపుగ, తెలుపుగ నుండును. ఈ దుంపనుండి సన్నముగ అర్ధగజమునుంచి గజముపొడవుగల ఆకుపచ్చని కాడలు పుట్టును. కాడలచివర తెలుపురంగుగల పూవులు పూచును. ఉల్లిరసము వెగటుగ నుండును. చలువచేసి ఆర్చును. రక్తశుద్ధి చేయును. నరములకు సత్తువ నిచ్చును. వాత, శ్వాసనేత్రరోగముల కన్నిటికి ఇవి బాగుగా పనిచేయును. నిక్కాకగల పశువులకు పులిచల్లలో ఉల్లిగడ్డలు నానవేసి పెట్టిన శాంతించును.

మోతాదు:- నీరుల్లి సవాసేరువరకు.

## —♦ నేరేడు (Eugenia Jambolana) ♦—

శ్లో॥ మహాజమ్బూ రాజజమ్బూ మహాస్కంధాబృహత్ఫలా.
టీ:- మహాజంబూ- రాజజంబూ- మహాస్కంధా- బృహత్ఫలా- నేరేడు పేర్లు.

నేరేడుచెట్లలో నేరేడు, అల్లనేరేడు, జన్ని, నేలనేరేడు కాకినేరేడు, అని అయిదు రకములుగలవు. నేరేడు పెద్దవృక్షము. ఆకులు కోలగ పెళుసుగ, పచ్చికాయలు ఆకుపచ్చగ దోరకాయ కొంచె మెరుపుగ బాగుగా పండినది నలుపుగనుండును. చెక్క రసము వగరుగ నుండును. రక్తమూత్రము, విరేచనముల కట్టించును. చెక్కపొడి రసికారుపుండ్లకు పనిచేయును.

మోతాదు:- చెక్కరసము అర్ధసేరువరకు.

## —♦ నేలవేము (Cherayta) ♦—

శ్లో॥ కిరాతతిక్తః కైరాతో భూనింబో రామసేనకః.

టీ:- కిరాతతిక్తః - కైరాతః - భూనింబః-రామసేనకః అనునవి నేలవేము పేర్లు.

మిరపమొక్కలవలె గుబురుగా పెరుగును. ఈమొక్క మొక్క ప్రతిభాగము చేదుగనుండును. సమూలము వేడి జేయును. రక్త జీర్ణవాత విషరోగములకన్నిటికి ఈసమూల మంతయు పనిచేయును. బలవర్ధకౌషధములలో దీనిని కలిపి వాడుదురు.

మోతాదు:- పొడి 2 తులములవరకు.

## —♦ నేపాళము (Croton Tiglium) ♦—

ఈ మొక్కలు పలుచోట్ల పెరుగుచున్నవి. దీని గింజల నుండి చమురును దీయుదురు. నేపాళగింజలు బలమైన విరేచనకారి. ఇది విషవస్తువు. బలవర్ధకౌషధములలో ఈ గింజలపొడి కలిపి

వాడుదురు. మలబద్ధకమునకు నేపాళనూనెను కొన్ని చుక్కలు నీటిలోవేసి త్రాగించిన పనిచేయును.

## —♦ నీలిమందు (Indigo) ♦—

నీలిచెట్టుఆకులు గుండ్రముగా చిన్నవిగా నలుపుకలసిన ఆకు పచ్చరంగుగ నుండును. ఇంచుమించు తంగేడాకు వలె నుండును. పిల్లిపెసరకాయలకంటె సగము చిన్నవియగు కాయలు కాచును. ఆకునూరి గోళ్లకు పట్టించినయెడల గోరు నీలిమందు రంగుగానగును. ఈ చెట్లనుండి నీలిమందు తయారుచేయుదురు. నీలిమందును పుండ్లపై చల్లిన పుండ్లు మానును. వెన్నతో మందు కలిపి కాలిన వ్రణములకు పూసిన మంటతగ్గును. పొడలకు, పుండ్లకు, వెండ్రుకలువచ్చుటకు ఈ మందును వాడవచ్చును.

## —♦ నువ్వులు (Sesamum Indicum) ♦—

శ్లో॥ తిలంఫలస్తైలఫలస్తిలపింజో పరస్పితః।
జాతిలో వనజాతస్స్యాత్ ॥

టీ॥ తిలంఫలః-తైలఫలః అనునవి నువ్వుల పేర్లు.
తిలపింజః తెల్లనువ్వులపేర్లు. జాతిలః-వనజాతః అడవినువ్వుల పేర్లు.

నువ్వులు కారముగ వగరుగ చేదుగనుండును. బలము గలిగించును. వేడిజేయును. నల్లనువ్వులు మంచివి. మావిపడని పశువులకు అర్ధసేరు త్రొక్కి వేడినీటిలో కలిపి త్రాగించిన పనిజేయును. నువ్వులపిండిని వెన్నలోకలిపి పైత్యపుదద్దురునకు

రాసిన పనిజేయును. నువ్వులు కల్లుబెల్లము కలిపి త్రొక్కి బల వర్ధకముగా దుక్కిటెద్దులకు పెట్టిన బాగుగాబలియును.

—♦ పంచదార (Sugar) ♦—

దీనిని చెరకురసమునుండియు, తేనెనుండియు, పుష్పములనుండియు, కొన్నివిధములదుంపలనుండియు తయారు చేయుదురు. శర్కర, యావనాశశర్కర, యవాసశర్కర, మధుశర్కర, పుష్పశర్కర అని అనేకతరగతులుగా పంచదారలు కలవు. పంచదార తెలుపుగలిగి చూర్ణముగనుండును చెరకునుండి తీసినపంచదార తీపిరుచిగలిగియుండును. చలువచేయును. వేడిజేసినప్పుడును, తదితరలేహ్యములతో కలిపి నాకించుటకు నుపయోగించును. మేయిదిగినపశువునకు అర్ధసేరు, సేరునీటిలో 10 తులముల పంచదార కలిపియిచ్చిన శాంతించును.

—♦ పంచలవణములు (Five kinds of Salts) ♦—

సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, కాచలవణము, సముద్రలవణము అని అయిదువస్తువులుకలసి పంచలవణమనబడును. ఇవి ఉప్పగ రుచిగనుండును. శరీరమును పోషించును. రుచిని పుట్టించును. మలమును వెడలించును. వాతజీర్ణరోగములకు బాగుగా పనిచేయును. ఆకలిని బుట్టించును. బలవర్ధకౌషధములలో కలిపి వాడవచ్చును.

—♦ పటిక (Alum) ♦—

సౌరాష్ట్రదేశపు గనులలోపుట్టు ఒకవిధమైన మన్ను గుడ్డలకు రంగువేయుటకు లోహములను స్వచ్ఛముగ ద్రవింప

జేయులకు ఉపయోగింతురు. ఇందు పటిక, పుల్లిక అను రెండు రకములుగలవు. పటిక కొంచెము పచ్చగను, బరువుగను, నును పుగను ఉండును. పుల్లిక తేలికగ తెలుపుగ పుల్లగ నునుపుగ నుండును. ప్రస్తుతము తెలుపుగ రాళ్లవలె నుండుపటిక మనకు దొరకుచున్నది.

ఇది వగరు కారము పులుపు రసములుగలిగి యుండును. వేడిజేయును. రక్తమునాపును. విరేచనముల కట్టించును. నోటి గాళ్లకు పటిక నీటిని అప్పుడప్పుడు కడుగుచుండిన గారపట్టును. కంటిరోగములకు ఈపటికనీటిచుక్కలు వాడిన పనిచేయును. నోరు దుర్వాసనగానున్నపుడు ఈపొడితో కడిగిన రుచిని పుట్టించును. నోరుపొక్కినపుడు పూతకు ఈనీరు బాగుగాపనిచేయును.

—♦ పత్రబీజము (Kalanchoe Laciniate) ♦—

దీనినే బీజపత్రము, గాయపాకు అందురు. ఆకులు పాతి పెట్టిన, వేరునాటి మొక్క మొలచును. ఆకు మందముగ పెళు సుగ, గరుకుగ నుండును. వగరుగ ఉప్పగ నుండును. ఆకు పసరును గాయములకుపట్టించిన బాగుగా పనిచేయును. కణతులపైన, కూటిగడ్డలపైన ఆకును తిరుగవేసి కట్టిన పక్వమునకు వచ్చును.

—♦ పసుపు (Turmeric) ♦—

శ్లో॥ హరిద్రారజనీ గౌరీ రంజనీ వరవర్ణినీ,
పిండాపీతా వర్ణవతీ నిశావర్ణవిలాసినీ.

టీ:- హరిద్రా - రజనీ - గౌరీ - రంజనీ - వరవర్ణినీ - పిండా - పీతా - వర్ణవతీ - నిశా - వర్ణవిలాసినీ అనునవి పసుపుపేర్లు.

దుంపప్రధానముగాగల మొక్క. ఆకులు పొడవుగ కొన దేలియుండును. ఆకులకుగూడ పసుపువాసన గలదు. గెలవేసి పూవులుపూచును. ఇందు అనేకరకములు గలవు. ఇది వెగటుగ చేదుగనుండును. ఉద్రేకకారియు, బలకారియునగు వస్తువు. వేడిజేసి ఆర్చును. జీర్ణశక్తిని గలిగించును. బలవర్ధకౌషధములలో కలిపి వాడవచ్చును. చర్మవ్యాధులకు నేత్రరోగములకు మూత్రరోగములకును దీనిని వాడవచ్చును.

మోతాదు:- 2½ తులములవరకు

## —♦ పర్పాటకము (Mollugo Cerviana) ♦—

శ్లో॥ పర్పటః కవచో రేణుః పిత్తహా వరకంటకః,
వరతిక్తః పర్పటకః పృథ్వీకశ్చర్మకంటకః.

టీ:- పర్పటః - కవచో రేణుః- పిత్తహా- వరకంటకః- వరతిక్తః- పర్పటకః - పృథ్వీకః - చర్మకంటకః - అనునవి పర్పాటకపు పేర్లు.

ఇది చిన్న చెట్టు. సన్ననిచిన్న ఆకులు చిన్న చిన్న కాయలు ఉండును. పూవులు నలుపు, ఎరుపు రంగులు గలిగియుండును. ఎర్రపూవులది శ్రేష్ఠము. దీనిరసము చేదుగనుండును. వేళ్లతో తైలమును తయారుచేయుదురు. రసము వేడిజేయును. వాతరోగములకు, చర్మరోగములకు బాగుగా పనిచేయును.

## —♦ పందిచముురు, పందిపెంట ♦—

పందిచమురు రుచిగానుండును. బలముచేయును. విరిగిన అవయవములను అతుకుకొనజేయును. వాతరోగములకు,

అరుగ్రివాపులకు బాగుగా పనిచేయును. మర్దనవలన నరములకు సత్తువజేయును. పందిపెంట అతివేడిజేయును. రక్తసంబంధమగు రోగములలో తుదకు పెంటను నీటిలో కలిపి కాచి వడపోసి నాలుగుగొట్టములు పెట్టవచ్చును.

—• పాలతుత్తము (White Vitriol) •—

వెగటుగ కారముగ నుండును. విషముల హరించును. దురదలను పోగొట్టును. చర్మరోగములు, వాతరోగములకు పనిజేయును. మైలతుత్తపు గుణములే దీనికిని యున్నవి.

—• పాషాణము (White oxide of Arsenic) •—

గౌరిపాషాణము పసుపుపచ్చగ రాయివలె నుండును. ఇది గనులలోపుట్టును కృత్రిమమగు పాషాణములు 64 రకములుగలవు. ఇందు ముఖ్యముగ రక్తపాషాణము, శంఖపాషాణము, ఉల్లిపాషాణము, గౌరిపాషాణము, సవీరము అనునవి ప్రధానములు. పాషాణములు మహావిషములు. అన్నిపాషాణములలో ఉల్లిపాషాణము బహుకౄరమైనది. పాషాణములన్నియు నోరుపట్టును. వీటినిగురించి తెలిసిన వైద్యుల నడుగుడు.

—• పిప్పళ్లు (Piper Longum) •—

శ్లో॥ పిప్పలీ చపలాకృష్ణామాగధీ మగధాకణా,
విశ్వోపకుల్యావైదేహీ శౌండీస్యాత్తీక్ష్ణతండులా.

టీ॥ పిప్పలీ-చపలా-కృష్ణా-మాగధీ-మగధా-కణా,
విశ్వా - ఉపకుల్యా - వైదేహీ - శౌండీ - తీక్ష్ణతండులా - పిప్పళ్ల పేర్లు.

పిప్పలితీగ మళయాళము మున్నగు చల్లని దేశములందు పుట్టును. ఆకులు ముదురు, తమలపాకు ఆకారముగ నుండును. తీగ బ్రాకును. పిప్పళ్లు చమురుగలిగియుండును. వేడిజేయును. రక్త, వాత, శ్వాస నేత్రరోగముల కన్నిటికి ఇవి బాగుగా పనిచేయును.

మోతాదు:- 4 తులములవరకు.

—♦ ఫిరంగి సాంబ్రాణి (Boswella glabra) ♦—

అందుగుచెట్టుయొక్క జిగురునకు ఫిరంగి సాంబ్రాణి యందురు, సువాసన. చేదుగానుండును. జీర్ణ, రక్త చర్మరోగములం దుపయోగించుదురు. చర్మవ్యాధులలో కలుపుచూర్ణములలో దీనిని వాడుదురు. పశువుల వాతము హరించుటకు బలియుటకు బలవర్ధ కౌషధములలో కలిపి వాడుదురు.

—♦ పిల్లిపీచర (Asparagesa Racemosus) ♦—

ఈమొక్కలు సరకుచెట్టు కొమ్మలవలె నుండును. ఈమొక్క అడుగున 100 వరకు తేగలుండును. ఈ తేగలు తీయగానుండుటచే తెల్ల చీమలు వానికి పట్టియుండును. వెగటుగా చేదుగానుండును. శ్వాసరోగములకు పనిచేయును. మొగబంతికి ఈ తేగలను ఎండబెట్టి చూర్ణముచేసి ముక్కురంధ్రములలో పార ఊదిన నెమ్మదియగును.

—♦ పుగాకు (Tobacco) ♦—

పుగచెట్లను శీతకాలమున పెంచుదురు. మూడుమాసములకు తయారగును. ఆకు సన్నముగ పొడవుగనుండును. పొడ

వైన వెన్ను వేయును. గింజలు మిక్కిలిసన్నముగ గసగసాలవలె నుండును. ఆకులు మిక్కిలి తీక్షణమైనవి. పొగాకుఅనియు దీనిని వాడుదురు. పుగాకు చేదు, కారముగానుండును. వేడిని గలుగ జేయును. దీనిలో "నికోటిక్" అను విషపదార్థమున్నది. పొగాకుతోటలలోనికి సామాన్యముగా పాము వెళ్ళదు. ఇది విషపదార్థము. చర్మవ్యాధులకు, నేత్రవ్యాధులకు, గాయములు, వ్రణములు మొదలగువానికి ఆకురసము, ఆకుపొడి పనిచేయును.

## —♦ పొగడ (Mimusops Elengi) ♦—

శ్లో॥ వకుళః కేశరోమద్యగంధస్సింహో విశారదః॥

టీ॥ వకుళః - కేశరః - మద్యగంధః - సింహః - విశారదః అనునవి పొగడ పేర్లు.

ఇది పెద్దవృక్షము. ఆకులు కోలగ నునుపుగ పెళుసుగ నుండును. దీనిపూవులు తెలుపుగ గుండ్రముగ అపరిమితపరిమళ ముగనుండును. ఎండినకొలది సువాసన హెచ్చును. దీనికాయ గంగరేగుపండువలెకొంచెముకోలగ నుండును. ఈచెక్కరసము గొడ్డుమోతు పశువులకుపెట్టిన చూలుకట్టును. ఇంకను ఈ రసము అతిసారము, రక్తాతిసారమునకు పెరుగులో కలిపియిచ్చిన తగ్గును. దంతములు కదలినచో ఈ చెక్కరసము పుక్కిలింపు జేయించిన తగ్గును. దంతములను గట్టిపరచును.

## —♦ పోక (Areca Catechu) ♦—

శ్లో॥ క్రముకం క్రముకం పూగం పూగీఫలముదాహృతం॥

టీ॥ క్రముకం-క్రముకం-పూగం-పూగీఫలం అనునవి పోక పేర్లు.

పోకచెట్లు సన్నముగ పొడవుగ పెరుగును. పోకకాయలు గెలలుగా కాచును. పోకపొత్తులను దొన్నెలవలె కుట్టి గృహోప కరణములుగవాడుదురు. పండినపోక జిగటగనుండును. పోక చెక్కలో ఆల్కాలాయిడ్ ఎరీకులైన్ అను ఒక విధమగు చమురుండును. నూటికి 14 వంతులు టానిక్కు యుండును. పొడి వగరుగనుండును. వేడిజేయును. విరేచనముల కట్టించును. వాతపునీరు దీయును. దూడలుపారుకొనిన వీటినిబెట్టవచ్చును.

## —♦ పెన్నేరు (Physalis Flexuosa) ♦—

శ్లో॥ అశ్వగంధాతురంగాహ్వా గోకర్ణ శ్చావరోహకః
వరాహకర్ణో వరదాబల్యా వాజీకరీవృషా.

టీ॥ అశ్వగంధా-తురంగాహ్వా-గోకర్ణః- అవరోహకః - వరాహ కర్ణః-వరదాబల్యా-వాజీకరీ-వృషా - అనునవి పెన్నేరుపేర్లు.

ఆకులు గుండ్రముగ మృదువుగనుండును. ఇది వేరు ప్రధానముగాగల మూలిక. దీనిపండ్లు ఎరుపుగ, గుండ్రముగ పగడములవలె నుండును. పండ్లలోనిగింజలు మిక్కిలి సన్న ముగ తెలుపుగనుండును.

దీని దుంప సువాసనగ నుండును. చలువచేయును. వాత మును హరించును. దుంపరసము వెగటుగనుండును ఇది దేహము లోని మలమును వెడలించును. దగ్గు వాతము చర్మవ్యాధుల కును దూడలకు అజీర్తిచేసినపుడును ఈదుంపరసము బాగుగా పనిచేయును. మోతాదు:- పొడి 6 తులములవరకు.

## — ప్రత్తి (Gossypium) —

శ్లో॥ కార్పాసః పటశూలశ్చా చ్ఛాదనీ బాదరః పిచుః.

టీ॥ కార్పాసః-పటశూలః-ఆచ్ఛాదనీ- బాదరః - పిచుః అనునవి ప్రత్తిచెట్టు పేర్లు.

పశువులు పారుకొనినపుడును రక్తవిరేచనములకు ఈఆకుపసరుగాని ఆకుతొక్కిగాని మజ్జిగలోగాని పెరుగులోగాని కలినీరులోగాని కలిపి రెండుమూడు మోతాదులిచ్చిన తగ్గును. కాయలరసము పాలలోకలిపి దగ్గులకు వాడిన తగ్గును. మోతాదు - ఆకుపసరు మువ్పాతిక సేరువరకు.

## — పెద్దనూను (Ailanthus Excelsa) —

దీనినేపెనువేప అందురు. వేపచెట్టువలనే యుండును. ఆకులుపెద్దవి, మాను తెలుపుగానుండును. చెక్కరసము వేడిజేయును. ఈరసములో మిరియాలు కలిపిపెట్టిన రొప్పు, దగ్గు తగ్గును. ఇంకను చెక్కరసము జీర్ణరోగములకు పనిచేయును.

మోతాదు:- చెక్కరసము అర్ధసేరువరకు.

## — బండిగురివింద (Adenanthera Pavonia) —

ఇది పెద్దతీగ. ఆకులు గుండ్రముగ జంటలుగ నుండును. నువ్వుపూవులవంటి పూవులు గుత్తులుగ పూచును. దీని ఆకు పసరు అరుగ్రవాపులకు, కల్లవాపులకు పనిచేయును. అగ్రుఖాచి చాల బాధగానున్నపుడు ఈ తీగను మెలికలువేసి మెడలో బండికట్టుటవలన తీగగాటునకు వాపు తగ్గగలదు.

—♦ బ్రహ్మదండి (Argemone Mexicana) ♦—

స్వభా: దీనినే పిచ్చి సొన చెట్టనియు, నులిపుచ్చ యనియు, బలురక్కసచెట్టనియు నందురు. ఇది పసుపుపచ్చని పువ్వులు పూచెడిచెట్టు, ఏటేట మొలచును. దీనిగింజలనుండి చమురు తీయుదురు. ఈ కొమ్మలనుండి వచ్చుసొనను దీర్ఘతలమాదలకు పనిచేయును. ఇంకను బ్రిహ్మదండిసమూలమునుదంచి రసము తీసి చర్మవ్యాధుల కుపయోగించిన బాగుగా పనిచేయును. ఇంకను ఈ పసరు విషపురుగుల కాట్లకు పనిచేయును. ఆకును ఉడికించి కట్టిన కాళ్ల వాపులు తగ్గును. వేళ్ల రసము నెరిడెకు పనిచేయును.

—♦ బొక్కెన (No- diflora) ♦—

శ్లో॥ తోయపిప్పల్యంబు వల్లీపలూరః కంచటస్తథా,
మత్స్యాదనీమత్స్య గంధాలాంగలీశకులాదనీ.

టీ:- తోయపిప్పలీ - అంబువల్లీ - పలూరః- కంచటః- మత్స్యాదనీ - మత్స్యగంధా- శకులాదనీ అనునవి నీరు పిప్పలిపేర్లు.

ఇది జలప్రాయ ప్రిదేశములందును, భూమిమీాదను ప్రాకును. ఆకులు చిన్నవిగ మృదువుగనుండును. ఆకురసము కాకజేయును. గాయములకు ఈ పసరు పట్టించిన తగ్గును. కర్ణజీర్ణ చర్మవ్యాధులకు దీనిని వాడుదురు.

—♦ బలుసు (Webera tertrandra) ♦—

శ్లో॥ బలాకాతిబలాభారవాజీస్యా ద్వృక్షగంధినీ

టీ:- బలాకా - అతిబలా - భారవాజీ - వృక్షగంధినీ అనునవి బలుసుపేర్లు.

దీని ముండ్లను తోకనుసిమిరి, మూద యైనవాటికి గ్రుచ్చుదురు. కొమ్మలు విరిగినపుడు ఆకును ఉడికించి వెండ్రుకలతో కలిపి కట్లు కట్టుదురు. ఆకురసము విరేచనముల కట్టించును.

## —♦ బాడిద (Erythrina Indica) ♦—

శ్లో॥ పారిభద్రోనిమ్బవృక్షోరక్తపుష్పః ప్రభద్రకః
కంటకీ పారిజాతస్స్యాన్మందారః కటికింశుకః.

టీ॥ పారిభద్రః-నింబవృక్షః-రక్తపుష్పః-ప్రభద్రకః-
కంటకీ - పారిజాతః - మందారః - కటికింశుకః అనునవి
బాడిదచెట్టు పేర్లు.

ఇది పెద్దచెట్టు,మ్రాను తెలుపుగనుండును. తెలుపు ఎరుపు పూవుల భేదములుగలవు. తెలుపుది మంచిది. చెక్క ఆకు రసము వెగటుగ కారముగనుండును. వాతరోగములకు: చర్మ రోగములకు కర్ణరోగములకు రసము పనిచేయును.

## —♦ బావంచాలు (Psoralea Corylifolia) ♦—

ఇవి నలుపుగ, సన్నముగ పెసరబద్దలవలె నుండును. మంచి పరిమళముగలవి. నల్లనిపూవులుపూచును. దీనికాయలు గుత్తులుగనుండును. చెట్టు దుర్గంధమైనది. ఇవి చర్మవ్యాధులకు పనిచేయును. గింజలు చేదుగనుండును. దేహములోని మలమును వెడలించును.

మోతాదు:- 3 తులములవరకు.

—♦ బాలింతబోలు (Balsmodendrow) ♦—

ఇది ఎరుపు నలుపు రంగులుకలిగి ముద్దవలెనుండును. సువాసనగనుండును. పాలతోనూరి గట్టివాపులకు పట్టివేసిన తగ్గును. కీళ్ళనొప్పులకుకూడ బాగుగా పనిచేయును.

—♦ బూరుగచెట్టు (Bombax) ♦—

అరణ్యములలోనుండు పెద్దవృక్షము. ఒక్కొక తొడి మకు 8 లేక 10 ఆకులుండును. వీటికి ముండ్లుండవు. దీని పూవులు తామరపూవులవలె ఎరుపుగనుండును. పండ్లు జిల్లేడు పండ్లవలెనుండును. ఈ కాయలనుండి దూదివెడలును. ఇది మిక్కిలి మెత్తగ మృదువుగ నుండును. బూరుగబంకకు మోచరసమని పేరు. బూరుగబంక తెల్లతుమ్మబంకవలె నుండును. పారుడును కట్టించును. ఇది వగరుగ తీయగ నుండును. వాతరోగములకుకూడ పనిచేయును.

—♦ బంక (Gum) ♦—

ఇది వెలగ తుమ్మ మొదలగువృక్షజాతులవలన ఉత్పత్తి యగును. మితముతప్పి భేదియిచ్చుటవలనను విషవస్తువులు తిను టచేతను గలిగెడు విరేచనములు నిలుపుటకు బంకనీళ్ళను త్రాగించెదరు. ఇంకను పొడితో మాత్రలు చేసినపుడు దీనిని వాడుదురు.

—♦ బెల్లము (Jaggery) ♦—

రుచికి తీయగానుండును. ఆకలిమందముగానుండునపుడు ఆహారవస్తువులతో యిచ్చుదురు. చేదుమందులు, తదితరమం

దులు యిచ్చునపుడు బెల్లపుపానకముతోగాని, బెల్లమును నాకించుటగాని చేయుదురు. చలువచేయును. వంటినీరుదీయును.

## —♦ బిళ్లుడు ♦—

ఈచెట్లు రాతినేలయందు బెరుగును. ఇరువదిజతలవరకు చిన్నఆకులుండును. చెట్టుచెక్కను మసిచేసి వెన్నలోగాని, వ్యాసులైనులోగాని, కలిపి అరుగ్రివాపులకు, తదితరవాపులకు మర్ధనచేసిన తగ్గును.

## —♦ బొగ్గు (Charcoal) ♦—

ఇది నిర్గంధకారియు, పొగవాయువులను పీల్చుకొను శక్తియుగలది. దీనిని మెత్తగాపొడిజేసి గాయములకు పట్టించిన మానును. ఇదనీటిలోని మురికిని, కుళ్లిపోయిన మాంసము మొదలగువాని దుర్గంధమును తీసివేయును. ఈపొడి గోధుమ, వరిపిండి నీటితోకలిపి ఉడికించి పశువులకు కలుగు వాపులకు, గడ్డలకు కట్టుదురు.

## —♦ మఱ్ఱి (Ficus India) ♦—

శ్లో॥ వటోరక్తపదాక్షేరీ బహుపాదో వనస్పతిః,
యక్షవాసః పదారోహీన్యగ్రోధస్స్కంధ జోద్రుమః.

టీ॥ వటః-రక్తపదా-క్షేరీ-బహుపాదః-వనస్పతిః- యక్షవాసః - పదారోహీ-న్యగ్రోధః-స్కంధజః-ద్రుమః-అనునవి మఱ్ఱిపేర్లు.

ఇది పెద్దవృక్షము. ఆకులుమందముగ గుండ్రముగ నుండును. చెట్టునకు గాటుపెట్టిన పాలుగారును. దీనిపండ్లు గుండ్రముగ పగడములవలె ఎరుపుగనుండును. ముదురుచెట్టునకు

ఊడలుదిగును. దీని ఊడలను శరీరమం దే భాగము విరిగినను తొంటినొప్పి కడుపునొప్పి మున్నగువ్యాధులకు పనిచేయును. ఊడలరసము విరేచనముల కట్టించును.

## —• మహిసాక్షి (Agallocha) •—

శ్లో॥ గుగ్గులుః కాలనిర్యాసో మహిషాక్షః పలంకషః,
జటాయుః కౌశికో ధూర్తో దేవధూపశ్శివః పురః.

టీ॥ గుగ్గులుః-కాలనిర్యాసః-మహిషాక్షః-పలంకషః - జటాయుః కౌశికః-ధూర్తః-దేవధూపః-శివఃపురః అనునవి మహిసాక్షి గుగ్గిలపు పేర్లు.

మరు భూమియందు గుగ్గిలపుచెట్లు గ్రీష్మకాలమున ఎండవేడిమికి కాగి చెట్లనుండి ఒక విధమగుసారము స్రవించును. అది రాత్రివేళ శీతలముచే గట్టిపడును. అదియే మహిసాక్షి యని పిలువబడుచున్నది. ఇట్లు వెలువడు గట్టిసారము కొంత బంగారువర్ణముగను, కొంత గేదెకన్నురంగుగను, మరికొంత తామరపూవురంగుగను, కొంత తెలుపుగను, కొంత నలుపుగను అయిదు రకములుగనుండును. ఈ వృక్షములు పర్వతప్రాంతములందుకూడ పెరుగును. దీని యాకులు చిన్నవిగ పూవులు ఎరుపుగ మిగుల చిన్నవిగ, అయిదు రేకులుగలిగి గుత్తులుగ యుండును. మహిసాక్షి చేదుగనుండును. వేడిజేయును. వ్రణములు, గడ్డలు, కణతులు మొదలగువానికి పనిచేయును. దీనిని ఇతరవస్తువులతో కలిపి విరిగిన భాగములకు వాడవచ్చును.

## —♦ మానుపసుపు (Berberis Asiatica) ♦—

ఇది ఒకచెట్టు. చెక్క పసుపురంగుగ నుండును. కొమ్మలను చిన్నచిన్న ముక్కలుగజేసి నీటిలోనానవేసి వానిని తినిపించి మిగిలిననీరు త్రాగించిన జీర్ణసంబంధమగు రోగములు తగ్గును. రసము చేదుగనుండును. వాత, చర్మ, నేత్రరోగములకు ఇది బాగుగా పనిచేయును.

## —♦ మే క వ ద రు ♦—

మేకలను కసాయివాడు కోసినవెంటనే లోపలనుండు వెచ్చని వదరు తీసికొనివచ్చి పశువులకు కలుగు నుసిమిరి, తామర మున్నగు చర్మవ్యాధులకు వాడిన బాగుగా పని చేయును.

## —♦ మైనము (Wax) ♦—

ఇది తేనెటీగలుకూర్చిన తుట్టె. దీనియందు తేనెను నింపును. ఈగలను ఎగురగొట్టి తెట్టెనుగ్రహించి తేనెను పిండుకొనగా మిగిలిన పిప్పమునకు మైనమందురు. పసుపురంగుగ, మెత్తగ జిగటగ నుండును. దీనిని ముఖ్యముగా పాళా స్త్రిర్లలో వాడుదురు. ఇది విరిగిన అవయవములను అతుకుకొనజేయును. నరములకు సత్తువజేయును. ఇంకను దీనిని తైలములలో కలిపి గాయములకు, వాపులకు రాయవచ్చును.

## —♦ ముళ్లతోటకూర (Amaranthus Spinosus) ♦—

ఈ మొక్కలు వర్షాకాలములో విశేషముగా పెరుగును. దీనిఆకులవద్ద ముండ్లుండును. దీనివేరు ఆకురసము వెగటుగ నుండును. ఈ మొక్కలలో ఎరుపు తెలుపు రెండుజాతులు

గలవు. ఎరుపుజాతికంటె తెలుపుది మంచిది. ఈ ఆకును పాడి పశువులుతినిన బాగుగాపాలిచ్చును. కాళ్ళజాడ్యములకు మెత్త గాళ్ళకు, చర్మవ్యాధులకు ఆకు బాగుగా పనిచేయును.

—♦ మినుములు (Black gram) ♦—

ఇని జిగురుచమురు కలిగియుండును. బలముకలుగ జేయును. ఎముకలువిరుగుట, పాలుచేపకుండుట మొదలగు వానికి వాడుదురు పాడిపశువులకు పెట్టిన పాలెక్కువ యిచ్చును. గిత్తలకు బుడ్డకొట్టినతరువాత మినపపిండిలో పాలను కలిపిపెట్టిన బలియును.

—♦ మిరెప (Capsicum Annum) ♦—

దీనిపుష్పాలు చిన్నవిగ తెలుపుగనుండును. పచ్చిమిరెప కాయలు ఆకుపచ్చగ, పండినవి ఎరుపుగనుండును. ఇందులో పొట్టిమిరెప దేశీవాళీమిరెప సీమమిరెప మొదలగు అనేకరక ములు గలవు. ఎండుమిర్చి వేడిజేయును. సేరునీటిలో మూడు గుప్పెళ్ళ ఎండు మిరెపకాయలనువేసి ఉడికించి చేతితో పిసికి వడపోసిన కారపుపాలందురు. ఈపాలను రక్తవాత జీర్ణరోగ ములలో వాడిన బాగుగా పనిచేయును. కడుపునొప్పి దొమ్మ, కురమ, ఇంక తెలియని రోగములకు ఈపాలు వాడిన పని చేయును. మోతాదు:- 4 తులములవరకు.

—♦ మెంతులు (Fenu Greek Seeds) ♦—

ఇదియొక చిన్నమొక్క. ఆకులు చిన్నవిగ కొంచెము గుండ్రముగనుండును. ఆకు చేదుగనుండును. మెంతులు వేడి జేసి ఆర్చును. పశువులకు దూడలకు అజీర్తి విరేచనములు

కడుపుబ్బు మున్నగు వ్యాధులలో పెరుగులో కలిపి పెట్టిన శాంతించును. మోతాదు:- 6 తులములవరకు.

—♦ మిరియాలు (Black Pepper) ♦—

శ్లో॥ మరిచంవల్లిజంతీక్ష్ణం మలినం శ్యామభూషణం.

టీ॥ మరిచం - వల్లిజం - తీక్ష్ణం - మలినం - శ్యామభూషణం - మిరియాల పేర్లు.

తెల్లమిరియాలు, నల్లమిరియాలు అని రెండురకములు. మిరియపుతీగెలు మళయాళదేశమునందు తిరువాన్కూరు తోటలయందు వేసి పెంచబడును. తీగెను ముక్కలుగా నరికి పాతిపెట్టుదురు. ఇవి మూడు సంవత్సరములకు పెద్దవై పంటకువచ్చును. మిరియపుతీగెల వెన్నునందు మిరియము లేర్పడును. పండుమిరియము ఎర్రగనుండి ఎండించిన పిదప నలుపుగనుండును. మిరియాలను నానబెట్టి పైపొట్టుతీసివేయ బడినవి తెల్లమిరియాలనియు, పొట్టుతీయనివి నల్లమిరియా లనియు చెప్పుదురు. గాని పుట్టుకతోనె తెల్లమిరియాలుండు నని చెప్పుదురు. తెల్లమిరియాలు కనపడవు. మిరియాలు వేడి జేయును. ఇవి అన్నిరోగములలో అమోఘముగా పని చేయును. రక్త, శ్వాస, జీర్ణ, నేత్ర, వాతరోగములలో నుపయోగించెడి మందులలో కలిపి వాడుదురు.

మోతాదు:- 3 తులములవరకు.

—♦ మోదుగ (Butea Frondosa) ♦—

శ్లో॥ పలాశః కింశుకః కర్ణియాజ్ఞికో బ్రహ్మపాదపః,
క్షీరశ్రేష్ఠోరక్తపుష్పస్త్రి వృతస్సమిదుత్తమః.

టీ॥ పలాశః-కింశుకః-కర్ణి-యాజ్ఞికః-బ్రిహ్మపాదపః-
క్షీరశ్రేష్ఠః - రక్తపుష్పః - త్రివృతః - సమిదుత్తమః -
మోదుగపేర్లు.

ఇది పెద్దవృక్షము. ఆకులు గుండ్రిముగ ఒక తొడిమికి మూడుఆకులు విడివిడిగనుండును. లేతఆకులు ఎరుపుగను ముదిరినఆకులు పచ్చగను ఉండును. కాయలు పొడవుగను కాయలోని గింజలు బద్దలవలె గుండ్రిముగను ఉండును. గింజలపై పొట్టు ఎరుపుగనుండును. మోదుగపువ్వు పసుపుపచ్చగ నుండును. తెలుపు, పసుపు, ఎరుపు, నలుపు రకముల పూలభేదములు గలవు. నలుపు, ఎరుపువి దొరకుటకష్టము.

మోదుగపువ్వు వెగటుగ కారముగనుండును. చలువ చేయును. రక్త, జీర్ణ, వాతములకు ఈపువ్వును జొన్నకలితోగాని బియ్యపుకలితోగాని కలిపిపెట్టిన తగ్గును.

మోతాదు:- పువ్వు 4 తులములవరకు.

## —♦ మంజిష్ట (Rubia Cordifolia) ♦—

ఇదియొక గ్రింథిదినుసు. ఈతీగెలు చెట్లమీద పాకుచుండును. దీని వేరునుండి ఎర్రిని రంగువచ్చును. మంజిష్ట వేడి జేయును. నేత్రి, కర్ణరోగములకు ఇది బాగుగా పనిచేయును.

## —♦ మణిశిల (Redgar) ♦—

శ్లో॥ మనశ్శిలా శిలాగోలానై పాలీకునటీకులా ।
దివ్యౌషధిర్నాగ మాతామనోగుప్తా మనోంబికా ॥

టీ॥ మనశ్శిలా-శిలా-గోలా-నైపాళీ-కునటీ-కులా
దివ్యౌషధిః-నాగమాతా-మనోగుప్తా-మనః-అంబికా
మణిశిల పేర్లు.

శ్యామాంగి, కణవీరక, ఖండక అని మణిశిల మూడు విధములు. శ్యామాంగి నలుపు తెలుపు, ఎరుపురంగులు గలిగి బరువుగానుండును. కణవీరక తామ్రవర్ణముకలిగి తెలుపు లేక తళతళలాడుచు బరువులేనిదై యుండును. ఖండక మిగుల ఎరుపుగానుండి చూర్ణరూపముగ మిగుల బరువుగనుండును. మొదటి దానికన్న రెండవది, రెండవదానికన్న మూడవది యుత్తమము. దీనిని శుద్ధిచేసి వాడవలెను. చేదుగా వెగటుగా నుండును. వేడి జేయును. చర్మవ్యాధులకు, మలిమిడికి, కణతులకు బాగుగా పనిచేయును.

## —• ముర్దారు సింగు (Plumbi oxibum) •—

ఇది సాధారణ రసములలో చేరినది. ఘూర్జరదేశమునందును, అర్బుదప్రాంతములందును పుట్టుఖనిజము. పచ్చని రేకులుగలిగి బరువుగనుండును. సీసతత్వముగలది. శుద్ధిచేసి వాడవలెను. మిగుల వేడిజేయును. చర్మవ్యాధులకు, తదితర బెణుకునొప్పులకు వాడవచ్చును.

## —• మజ్జిగ (Butter Milk) •—

చలువచేయును. తేలికగనుండును. రక్తములోని వేడి మినితీయును. కాకరోగములకు తదితర మందులతో మజ్జిగ కలిపి ఈయవలెను.

## ముషిణి (Nux Vomica)

దీనినే విషముష్టి, రణముష్టిఅందురు. ఆకులు గుండ్రముగ కాయలు నిమ్మకాయంత ప్రమాణముగలిగి గుండ్రముగనుండును. పండినపుడు దీనిపండ్లు ఎరుపుగ, అందముగ నుండును. దీనిలోని గింజలు గుండ్రముగ బద్దలవలెనుండును. ముషిణిగింజలు మహాచేదుగనుండును. ఈ గింజలనుండి చమురు దీయుదురు. ఈ గింజలపొడి విరేచనముల గావించును. బలవర్ధకౌషధములలో ఈ గింజలపొడి కలిపి వాడుదురు. రక్తమూత్రము, మలబద్ధకము, పక్షవాతము మున్నగు రోగములకు ఈ గింజలపొడిని తదితరమందులలో కలిపివాడిన బాగుగా పనిచేయును.

మోతాదు:- పొడి 1 తులమువరకు.

## మునగ (Moringa Pterygosperma)

శ్లో॥ శిగ్రుశ్శోభాంజనః కృష్ణగంధస్స్యాద్బహులచ్ఛదః.

టీ॥ శిగ్రుః-శోభాంజనః - కృష్ణగంధః - బహులచ్ఛదః అనునవి మునగపేర్లు.

ఇది సాధారణమైన వృక్షము. ఎరుపు, తెలుపుగల పూవులు రెండువిధములు. ఇవిగాక నల్లపువ్వులమునగ కూడ గలదు. ఇది అరుదుగ దొరకును. ఈగింజలనుండి పరిశుభ్రమైన నూనె తీయుదురు. దీని చెక్కరసము వేడిజేయును. దొమ్మ, నాలిదొమ్మ, గురకమున్నగు వ్యాధులకు బాగుగాపనిచేయును. ఆకును ఆముదముతో ఉడికించి బొడ్డువాపులకు బెణుకులకు

కట్టిన తగ్గును. పువ్వులరసమును తేనెతోకలిపి కంటి పువ్వులకు రేజీకటికి పెట్టినతగ్గును.

### —♦ మూరొ్కండ (Acalypha Indica) ♦—

ఆకుయొక్క గుండ్రితనము కోలదనము భేదముచేత రెండువిధములు. గుండ్రిఆకులది మూరొ్కండఅనియు కోలఆకులదికుప్పింట అనియు వాడుదురు. ఆకు రసము వేడిజేయును. పురుగులు పడినపుండ్లకు ఈఆకునువాడిన పురుగులు చచ్చును. పీనస మొగబంతి మున్నగువాటికి ఈపసరును 10 చుక్కలు పోసిన వెంటనే తుమ్మును.

మోతాదు:- పసరు 1 తులమువరకు.

### —♦ మూత్రములు ♦—

ఆవు గేదె గొ్ర్రె మేక గాడిద మొదలగు వానిమూత్రములు సాధారణముగ పాచన దీపముల గలిగించును. ఉప్పగ తేలికగ కొంచెము కారముగ చేదుగనుండును. రక్త, క్రిమిరోగములకు పనిచేయును.

### —♦ రావి (Ficus Religiosa) ♦—

శ్లో॥ పిప్పలశ్శ్యామలోశ్వత్థః క్షీరవృక్షో గజాశనః,
హరివాసశ్చలదళోమఙ్గల్యోబోధి పాదపః.

టీ॥ పిప్పలః - శ్యామలః - అశ్వత్థః - క్షీరవృక్షః - గజాశనః - హరివాసః - చలదళః - మంగళ్యః - బోధిపాదపః - రావి చెట్టు పేర్లు.

ఇది పెద్దవృక్షము. మిగుల ప్రసిద్ధమైనది. చెక్కరసము వగరుగనుండును. చలువజేయును. చెక్కపొడి పుండ్లకు పని చేయును. మసిబొగ్గులో చెక్కపొడికలిపి రసికారు పుండ్లకు పట్టించినమానును. చెక్కను నీటిలో నానవేసిగాని, కాచి గాని నోటిపూతలకు పుక్కిలింపు చేయించవచ్చును. రోగపశు వులకు కాచి చల్లార్చి ఈవగరునీటిని పథ్యముగా పెట్టవచ్చును. పక్షవాతముగల పశువునకును, నోటినుండి వదరు, కఫ్క, లకును చెక్కరసముతో ఆవుపాలు కలిపిపెట్టిన తగ్గును.

మోతాదు:- చెక్కపొడి 2½ తులములవరకు

## —♦ రేల (Cassia Fistula) ♦—

ఇది సాధారణమైన చెట్టు. ఆకులు పొడవుగ కోలగ నుండును. పసుపుపచ్చపూవులును, సన్నముగ గుండ్రముగ అర్ధగజమునుంచి గజమువరకు పొడవుగల కాయలుండును. పండ్లు నలుపుగ, పచ్చివి ఆకుపచ్చనివిగనుండును. పండినకాయు లోని గుజ్జు నల్లగ చింతపండువలె నుండును. పలుచని బద్దల వంటి గింజలుండును. ఈకాయలను నక్కలుతినును. ఆకు, విరే చనము గావించును.

మోతాదు:- ఆకుపసరు అర్ధసేరు.

## —♦ రేగు (Zizyphus Jujuba) ♦—

శ్లో॥ బదరంకోలకంకోలం సౌవీరం ఫేనిలంకువం.
టీ॥ బదరం - కోలకం - కోలం - సౌవీరం - ఫేనిలం - కువం - రేగుచెట్టుపేర్లు.

రేగుచెట్లలో అనేకరకములుగలవు. చిట్టిరేగు, గంగ రేగు, పుల్లరేగు మున్నగునవికలవు. ఈ చెట్టునకు చిన్నచిన్న ముండ్లుండును. చిన్న ఆకులు, ఉస్తికాయ మొదలు పొగడ పండంతవరకు పెద్దవియగు కాయలును తెల్లని పూవులును ఉండును. కాయలలో రుద్రాక్షలవంటి ఆకారముగల గింజ లుండును.

చెక్కరసము వగరుగనుండును. చెక్కపొడి పుండ్లకు బాగుగా పనిచేయును. రేగుపొట్టు పాడి పశువులకు పెట్టిన పా లెక్కువయిచ్చును. వెన్న నెక్కువ కలుగజేయును.

—♦ రేవల్చిన్ని (Rheum Emodi) ♦—

ఈ మొక్కలు హిమాలయప్రాంతములం దెక్కువగా పెరుగుచున్నవి. ఈ మొక్క వేరునుకోసి పైచర్మమును వలచి ఎండబెట్టుదురు. ఇది పసుపుపచ్చగనుండును. రసము చలువ జేయును. వంటినీరు దీయును. విరేచనము గావించును. మల బద్ధకమును పోగొట్టును. మజ్జిగలో రేవల్చిన్ని కలిపి వాడిన మూత్రరోగములు పోవును.

మోతాదు:- రసము సేరువరకు.

—♦ లవంగాలు (Caryophyllus) ♦—

శ్లో॥ లవంగం శిఖరందివ్యం లవంచందనపుష్పకం।
శ్రీపుష్పం దేవకుసుమం భృంగారం వారిసంభవం॥

టీ॥ లవంగం-శిఖరం-దివ్యం-లవం-చందనపుష్పకం
శ్రీపుష్పం - దేవకుసుమం - భృంగారం - వారిసంభవం - లవంగము పేర్లు.

ఈ చెట్లు కేరళదేశమున పెరుగును. ఆకు సువాసనగను, చెట్టు మనోహరముగను యుండును. ఈ చెట్లను పెంచుటకు మళ్ళలో అడుగడుగు దూరమున కాయలు పాతెదరు. కాయ లెంతఎండిన అంతమంచిది. ఎండినచో వానిశక్తి తగ్గిపోవును. పాతినవారముదినముల కవి మొలక లెత్తును.

లవంగములు వేడిజేయును. రక్త, జీర్ణ, వాతరోగము లలో బాగుగాపనిచేయును. నేత్రరోగములకు ఈ గంధము పనిచేయును.

మోతాదు:- పొడి 2 తులములవరకు.

## వస (Acoveus Calamus)

శ్లో॥ వచోగ్ర గంధాగోలోమీ షడ్గ్రంధా జటిలామతా।
జటిలాశతపర్వాన్యాలోమశా హైమవత్యపి.

టీ॥ వచా - ఉగ్రగంధా-గోలోమీ-షడ్గ్రంధా-జటిలా అను నవి వసపేర్లు.
జటిలా-శతపర్వా-లోమశా-హైమవతీ - అనువవి తెల్లవస పేర్లు.

ఈ మొక్కల ఆకులనుండి తైలమును దీయుదురు. దుంప మదపువాసనగలిగి యుండును. సొంటివంటిది. వేడిజేయు ను. శిరోవాతములకు ఆవుపాలలో వసకలిపి త్రాగించిన పని చేయును. వసపొడి పురుగులను చంపును. ఘాటయిన వాసన కొట్టును.

మోతాదు:- వసపొడి 1 తులమువరకు.

## —♦ వాము (Ptychotis Ajown ♦—

శ్లో॥ జవానీదీప్యకోదీప్యో దీపనీయాజవానికా ।
జవసాహోగ్ర గంధాస్యాజ్జవాహ్వాభూకదంబకః॥

టీ: - జవానీ-దీప్యకః - దీప్యః - దీపనియా- జవానికా-జవసాహః-ఉగ్రగంధా-జవాహ్వా-భూకదంబకః ఓమము, వాము పేర్లు.

వాముచెట్లు చౌడుగల పొలములలో నేలమీాద ప్రాకెడు చిన్న చెట్లుగనున్నవి. కొన్నిచోట్ల జానెడెత్తువరకు పెరుగును. దీనిశిఖరములందు గుత్తులుగుత్తులుగా పువ్వులు పూచి క్రమముగా పువ్వులలో గింజలేర్పడును. వాము జీర్ణకారియగు వస్తువు. జీర్ణరోగములకన్నిటికి బాగుగాపనిచేయును. బలవర్ధకౌషధములలో కలిపి దీనినివాడవచ్చును.

మోతాదు :-వాము 6 తులములవరకు.

## —♦ వాయింట (Cleome Penlaphylla) ♦—

శ్లో॥ అజగంధా వస్తుగంధా కబరీపూతబర్బరా॥

టీ :-అజగంధా - వస్తుగంధా - కబరీ - పూతబర్బరా, అనునవి వాయింటపేర్లు.

ఇదిచిన్న మొక్క. గజముయెత్తులోపుగ పెరుగును. చెట్టునకంతకు ఒకవిధమగు వెగటువాసనయు, తెల్లని పూవులును, సన్నగాపొడవుగా నుండుకాయలును, కాయలలో నల్లని చిన్నగింజలును యుండును. ఇందు వాయింట, కుక్కవాయింటయని రెండుజాతులుకలవు. ఆకులుగుండ్రముగ చిన్నవిగ నుండును.

ఆకుపసరు వేడిజేయును. చర్మరోగములకు, కర్ణరోగములకు బాగుగా పనిచేయును.

—♦ వావిలి (Vitex Negundo) ♦—

శ్లో॥ నిర్గుండీ శ్వేతకుసుమస్సింతుక స్సిందువారకః॥

టీ :-నిర్గుండీ- శ్వేతకుసుమః- సింతుకః- సిందువారకః అనునవి వావిలిపేర్లు.

ఇది పెద్దవృక్షము. మారేడాకులవలె దీనియాకులు మూడు చిల్లలుగనుండును. తెల్లవావిలి ఊదారంగుగనుండును. ఈ చెట్టుక్రిందనుండు మట్టికూడ నలుపుగ నుండును. దీనికఱ్ఱతో అన్నము వండునపుడు, కలియబెట్టిన అన్నమంతయు నలుపుగ నుండును. దీనిపూవులుగుత్తులు కోలగనుండును. ఆకుపసరు వేడిజేయును. వాతరోగములలో అమోఘముగా పనిచేయును. పశువునకు వెన్నెముకకు వెనుక మొత్తలకు దెబ్బలు తగిలినపుడు, పుట్టమన్నుతో వావిలాకు ఉడికించి గోరువెచ్చనిది రెండు మూడు పర్యాయములు కొట్టినతగ్గును.

మోతాదు :-పసరు అర్ధసేరువరకు.

—♦ వేప (Melia Azadirachta) ♦—

శ్లో॥ నింబోనియమనోనేతారిష్టస్స్యాత్పారిభద్రకః,
సుతిక్తస్సర్వతోభద్రః పిచుమందః ప్రభద్రకః,
కుష్టహాదేవదత్తశ్చరవిసన్నిభసూర్యకః

టీ॥ నింబః-నియమనః-నేతా-అరిష్టః-పారిభద్రకః,
సుతిక్తః-సర్వతోభద్రః-పిచుమందః-ప్రభద్రకః,
కుష్ఠహా-దేవదత్తః-రవిసన్నిభః-సూర్యకః అనునవి వేపపేర్లు.

ఇదియును పెద్దదియగు ప్రసిద్ధమైన వృక్షమైయున్నది. ఆకు చెక్క కాయ పువ్వమున్నగునవి వైద్యమున కుపయోగ పడుచున్నవి. దీనిసమూలమందలి యేభాగముచూచినను మిక్కిలి చేదుగానుండును. ఈచెట్టునందు గాలిని శుభ్రముచేయు మంచి గుణముకలదు. చెక్కపొడి పుండ్లకు పనిచేయును. వేపఆకు పసరులో తగినంత మంచినూనె కలిపి గోమారులున్న పశువుల శరీరమునకు రాసి ఒకఅరగంట ఎండలో కట్టిన అన్నియు రాలి పోవును. చర్మవ్యాధులకు, గాయములకు చెక్కరసము బాగుగా పనిచేయును. పాముకాటునకు వేపచిగుళ్ళరసముపశువు ముక్కు రంధ్రములలో పిండిన తుమ్ములు వచ్చును.

మోతాదు:-చెక్కపొడి 3 తులములవరకు.

## —♦ వెల్లుల్లి (Allium Sativum) ♦—

శ్లో॥ గృంజనోన్యోమహాకందోదుర్జరోదీర్ఘపత్రకః.

టీ॥ గృంజనః-మహాకందః-దుర్జరః-దీర్ఘపత్రకః అనునవి వెల్లుల్లి పేర్లు.

వెల్లుల్లి గాటువాసన గలిగియుండును. ఆకులు సన్నముగ పొడవుగనుండును. పులుపు అనురసము ఒకటి తప్ప తక్కినరసములన్నియు కలవు గనుక దీనికి రసోనయని పేరు. తెలుపుగనుండును గనుక వెల్లుల్లియందురు. వెల్లుల్లిదుంపయందు కారము, ఆకులయందుచేదు, కాడయందువగరు, కాడచివర ఉప్పు, బీజములందు తీపిరుచులుండును. వెల్లుల్లి నీరుల్లివలెనే యుండును. వేడిచేయును. వెల్లుల్లిరసము పేగులలోని క్రిములను

చంపును. దీనియందు కుశ్ఛ్రజేయుగుణము కలదు. వాత, రక్త జీర్ణ, చర్మ, నేత్రరోగముల కన్నిటికి బాగుగా పనిచేయును.

మోతాదు:-3 తులములవరకు.

## —♦ వెలగ (Ferami Elephantum) ♦—

శ్లో॥ కపిత్థకో దధిఫలః కపిత్థస్సురభిచ్ఛదః.

టీ॥ కపిత్థకః-దధిఫలఃకపిత్థః-సురభిచ్ఛధః- వెలగపేర్లు.

వెలగఆకురసము విరేచనముల కట్టించును. వెలగ కాయలో టానిక్ ఆసిడ్‌గలదు. అందుచేత నిది పారుడురోగ ముకట్టించును. ఆకురసములో నూనెకలిపి తగినంతగా పెట్టిన రొప్పు, దగ్గు తగ్గును.

## —♦ వెంపలి (Galega Purpurea) ♦—

శ్లో॥ శరపుంభాకాలశాకంపీహారిః కాలకామతా,

టీ॥ శరపుంభా-కాలశాకం-పీహారిః-కాలకా-అనునవి వెంపలిపేర్లు.

ఇది సాధారణముగా నీలిచెట్టువలెనుండును. వెంపలి ఎరుపు, తెలుపు రంగుల పూవులభేదములేగాక ముళ్లుగలది మరియొకటిగలదు. కాయలు సన్నముగ పొడవుగ బద్దవలె నుండును. కాయలపైని సన్నని నూగుండును. తెల్లవెంపలి భూమిమీదనే పాకును. ఆకుపసరు వేడిగలిగించును. కసిమిరి తుమ్ములకు పనిచేయును. ఆకురసము వగర్పుగా నున్నచో ముక్కురంధ్రములలో పోసినతగ్గును.

—♦ వెదురు (Bambusa Arundinacea) ♦—

శ్లో॥ వంశా వేణుః కీచకస్స్యాత్కర్మారస్త్వచిసారకః,
మస్కరశ్శతపర్వాచ కంటాలుః కంటకీతథా.

టీ॥ వంశః-వేణుః-కీచకః-కర్మారః-త్వచిసారకః,
మస్కరః - శతపర్వా - కంటాలుః - కంటకీ, వెదురు పేర్లు.

ఇది పొద. పొదవుగా పెరుగును. వెదురు కర్రలను ఇండ్లకుపయోగించుదురు. ఆకులు సన్నముగా పొడవుగా నుండును. పూవులు తెల్లగనుండును. వెదుళ్ళ మధ్యనుండి బియ్యము వంటి యొక పదార్థము ఒకొక్కప్పుడు వచ్చును. వెదురు చేదుగ పులుపుగ వగరుగనుండును. ఆకులో కోతకోయు స్వభావముగలదు. ఆకురసము కారముగ చేదుగనుండును. కసిమిరి, మొగబంతి, తెలియని రోగములు, నల్లకప్పు మున్నగు వ్యాధులకు బాగుగా పనిచేయును. లేతయాకులలో కొద్దిగా మిరియాలు ఉప్పుచేర్చి తినిపించిన పశువులకు కలుగు విరేచనముల కట్టించును.

మోతాదు:- ఆకులు 8 తులములవరకు.

—♦ విషబొద్ది (Sida Acuta) ♦—

ఈ చెట్టు వత్సనాభి మొక్కవలెనుండును. ఎరుపు పసుపు రంగుల పూవులుపూచును. దీని కాయలు మిరెపకాయలవలె నుండును. కాయపై మూడు చారలుండును. గింజలకు ఎరుపు రంగుగల చర్మముండును. విషబొద్దిదుంపను దేశీయనాభి అందురు. దుంపరసము వెగటుగ నుండును. చర్మవ్యాధులకు పనిచేయును.

—♦ విషకంటకాలు ( Cuminum Cyminum) ♦—

దీనినే అడవిజీలకర్రయందురు. ఆకుపైన నూగుండును. ఇది జీలకర్రవలె కోలగనుండును. మిక్కిలి చేదుగనుండును. గుజ్జుపుమసాలలో ఈ గింజలను వాడుదురు. కడుపునొప్పి, అజీర్తి, కడుపుకుట్టుమున్నగు జీర్ణసంబంధమగు రోగములలో బాగుగా విషకంటకాలు పని చేయును.

మోతాదు:-3 తులములవరకు.

—♦ విభూతి (Sacred White ashes) ♦—

అనగా సోమయాజులు రావి మోదగు మొదలగు కట్టెలతో అగ్నిహోత్రముచేసి హోమములు చేయుచుండునట్టి బూడిదగాని, గోమయము ఎండించి కాల్చిన బూడిదనుగాని, శరీరముకు నొసలునకు పూసుకొనిన పాపములుతొలగును. చర్మరోగమునశించును. తాపమణుగును, భూతప్రేత పిశాచబాధలు తొలగును. వాతములకు పొడలకు చర్మవ్యాధులకు పని చేయును.

—♦ వెఱ్ఱిపుచ్చ (Citrullus Colocynthus) ♦—

ఇదియొకతీగ. పుచ్చతీగవలెనుండును. దీని కాయలు దబ్బకాయలంత యుండును. తీగఅంతయు అమితమైన చేదు గలిగియుండును. కాయలలోని గింజలు నలుపుగ గుమ్మడి గింజలవలెనుండును. కాయలు గుండ్రముగనుండును. ఆకులపై తెలుపుజీరలుండును. ఆకురసము చేదుగనుండును. చర్మరోగములునశించును. కాయలను వాతరోగములకు వాడుదురు.

## —♦ వేడికాపడము (Fomentation) ♦—

నీరుగాని, ఉప్పుగాని, తవుడుగాని వేడిజేసి ముతకగుడ్డలోవేసిగాని, ముంచిగాని వాపులకుబెణుకులకు వాతనొప్పులకు కాచిన నొప్పులు హరించును.

## వాకుడు (Solanum V acquini)

దీనినేచిన్నములక యందురు. నేలమీద పాకును. ముండ్లుండును. ముండ్లు పసుపుపచ్చ వన్నెగలిగి తెలుపుగనుండును. నేలములక కాయలవలనే కాయలుకాచును. ఊదా తెలుపురంగుల పూవులుపూచును. తెలుపుపూవులది మంచిది. దీని ఆకులు వంగఆకులవలెనుండును, గాని వాటికన్నచిన్నవి. కాయలు చిన్నవిగ గుండ్రముగ నుండును. పండినపుడు పసుపు పచ్చగనుండును. ఆకు పసరు వెగటుగ కారముగనుండును. కాకజేయును. కొమ్ముమ్డొల్లలు నాసికారోగములు శిరోరోగములకు ఈపసరు పనిచేయును. కొందరు వైద్యులు పశువునకు కలుగు పుండులో పురుగులుపడినయెడల ఈచెట్లలో ఒకదానిని తీసివేయుదురు.

## —♦ సీతాఫలము (Anona Squamosa) ♦—

ఇది సాధారణమైన చెట్టు. దీనిఆకులు కోలగా బలమైన పసరువన్నెగలిగి మృదువుగానుండును. దీనిలోని గింజలు నలుపు రంగుగనుండును. పండ్లు, పైభాగము బుడుపులు కలిగియుండును. గుజ్జు తెలుపుగ మధురముగనుండును. ఆకును తేళ్లుగల రంధ్ర

ములలో పెట్టిన బైటికివచ్చును. ఆకురసము పురుగులు పడిన పుండ్లలో వేసిన పురుగులు చచ్చును.

### —♦ సీమసున్నము (Chalk) ♦—

విరేచనముల కట్టించును. పుండ్లను మాన్పును.

### —♦ సారాయి (Wine) ♦—

ఇది వెగటుగ చేదుగ నుండును. సారాయి ఉద్రేకమగు వస్తువు. వేడిజేయును, విరేచనముగావించును. విరిగినఎముకలను అతుకుకొనజేయును. తెలియనిరోగములలో కూడ సారాయి వాడవచ్చును. దొమ్మ, గురక, కురమరోగములకును, పశువు శీతలములో నున్నపుడును సారాయిని వాడిన బాగుగా పని చేయును.

1 మోతాదు:- 9 డ్రాములవరకు

### —♦ శొంఠి (Zingiber Officinale) ♦—

శ్లో॥ శుంఠీ విశ్వౌషధం విశ్వం కటుభద్రం కటూత్కటం,
మహౌషధం శృంగిబేరం నాగరం విశ్వభేషజం.

టీ॥ శుంఠీ - విశ్వౌషధం - విశ్వం- కటుభద్రం - కటూత్కటం- మహౌషధం - శృంగిబేరం - నాగరం విశ్వభేషజంఅనునవి శొంఠి పేర్లు.

అల్లమును సున్నపునీళ్లతో ఉడకబెట్టి ఎండించిన శొంఠి యగును. అన్నిమందులకన్న యోగ్యమైనదిగాన మహౌషధ మనియు విశ్వభేషజమనియు నందురు. కారముగలది కనుక

కటుగ్రంధియనియు, కఫమును హరించునది గాన కఫాదిక యనియు, శరీరము నార్చునది గాన శోషణమనియు దీని కీపేరు గలిగెను. శొంఠి వేడిజేయును. కారముగ నుండును. వాతజీర్ణ రోగములకు అమోఘముగా పనిజేయును.

మోతాదు:- 4 తులములవరకు

—♦ సోపు (Pimpinella Anisum) ♦—

జీలకర్రవలెనుండునుగాని అంతకన్న పెద్దది వడ్లగింజలో నాల్గవవంతుయుండును. సువాసనగానుండును. నమలిన తీపిగా నుండును. జీర్ణశక్తిని కలుగజేయును. రక్తవాత జీర్ణరోగముల కన్నిటికి యిది బాగుగా పనిచేయును.

మోతాదు:-4½ తులములవరకు.

—♦ సుద్ద ♦—

దీనినే నాముఅందురు. తెల్లనిమన్ను కొండలలో దొర కును. తడిపినయెడల వెన్నవలెమృదువుగనుండును. తేనెటీగలు కందిరీగలుకుట్టి దద్దురు పుట్టినపుడు నామునురాసిన మంట తగ్గును.

—♦ సున్నము (Lime) ♦—

రాతిసున్నము అనగా సున్నపురాళ్లను కాల్చిన సున్న మగును. దీనిని నీటిలో వేసి ఆరకుండనుంచిన ఘాటుగనుండును. శరీరముపైన వేసిన పొక్కును. సున్నము ఆముదము కలిపి నీరు పోసి బాగుగా మర్దించిన వెన్నవంటి చక్కని పాళాస్త్రి తయారగును. దీనినే నవనీతమందురు. కాలిన బొబ్బలకువాడిన

పనిచేయును. సున్నమునీటిని త్రాగించిన విరేచనమగును. గుల్లసున్నమునకు గూడ ఈగుణములే యుండును.

మోతాదు:- 3 తులములవరకు.

## —♦ సుగంధపాల (Country Sarasaparilla) ♦—

శ్లో॥ శారిబాశారదాస్ఫీతా గోపకన్యాప్రతానికా ।
గోపాంగనా గోపవల్లీలతాహ్వాకాష్ఠశారిబా॥

టీ :-శారిబా-శారదా-స్ఫీతా-గోపకన్యా-ప్రతానికా - గోపాంగనా-గోపవల్లీ- లతాహ్వా- కాష్ఠశారిబా అనునవి సుగంధపాల పేర్లు.

దీనిలో నల్లసుగంధి తెల్లసుగంధియని రెండురకములు. నల్లసుగంధికి బర్రెసుగంధియని వాడుకపేరు. సుగంధి చిన్న తీగవంటిమొక్క. తెల్లసుగంధిని పాలసుగంధియనియు, సుగంధపాలయనియు వాడుదురు. దీనివేరు సువాసనగానుండును. బర్రెసుగంధివేరు పరిమళము తక్కువ. ఆకులు పొడవుగా తెలుపు చారలు కలిగి ఎర్రనేలయందెక్కువగా పెరును.

## —♦ సన్నరాష్ట్రము (Galangal Lesser) ♦—

ఇదియొక దుంపజాతి. దీనినే కళింగ రాష్ట్రమందురు. పసుపుమొక్క సర్వాకారములు గలిగియుండును. దీని సర్వాంగములకు సువాసనగలదు. బాగుగాముదిరిన చెట్టుయొక్క మధ్యను ఒక పెద్దపువ్వుపూచి అనాసకాయవలె ఎరుపురంగు గలిగి గుండ్రముగానుండు ఒక కాయకాచును. ఇది వెగటుగ,

కారముగ, చేదుగనుండును. వేడిజేయును. వాతరోగములలో వాడుదురు.

—♦ సీకాయ (Acacia Concinna) ♦—

ఆకులు చింతాకులవలె అంతకన్న చిన్నవిగనుండును. గుల్మజాతిలోనిది. దీనికాయలు దిరిసెనపు కాయలవలె నుండును. ఎండినపుడు నలుపురంగుగ నుండును. చర్మరోగములకు సీకాయరసము బాగుగాపనిచేయును. ఇంకను జీర్ణ సంబంధమగు వ్యాధులలోగూడ ఈ పసరును వాడుదురు.

—♦ హంసపాది (Vitis Pedata) ♦—

పొలములలో భూమినంటుకొనిపాకు ఒకజాతి మొక్క. ఆకులు పక్షియొక్క అడుగువలె గొగ్గులుగలిగి చిన్నదిగ నుండుటచే దీనికి హంసపాదియని పేరువచ్చినది. నూతులు చెరువులు మొదలగు ప్రాంతములందు ఎక్కువగా మొలచును. ఆకుపసరు చేదుగ స్వాదుగనుండును. చర్మవ్యాధులకు పనిచేయును. సాలెపురుగుల విషములకుకూడ పసరును వాడవచ్చును.

# ద్రవ్య వర్గము

## —♦ కర్పూరము (Camphora Officinaru) ♦—

శ్లో॥ కర్పూర స్స్ఫటిక శ్చంద్ర స్సితాభ్రో హిమవాలుకః,
హిమోపలశ్శీతరజోభూతి కస్తుహిమాహ్వయః,
హిమాంభోఘన సారశ్చశ్చంద్రాహ్వోశ్చాపి గీయతే.

టీ॥ కర్పూరః-స్ఫటికః:చంద్రః-సితాభ్రః-హిమవాలుకః-హిమోపలః-శీతరజః-భూతికః-హిమాహ్వయః అనునవి కర్పూరపు పేర్లు. హిమాభ్రః-ఘనసారః-చంద్రాహ్వః- అనునవి పచ్చ కర్పూరపు పేర్లు.

కర్పూరవృక్షము శీతలప్రదేశములందు పెరుగును. కర్పూరము చెట్టునుండి పుట్టుసారము. దీని సర్వాంగములును సువాసనగానుండును. కర్పూరమును వెలిగించి దేవునకు నీరాజన మిత్తురుగాన హారతికర్పూరమనియు దీని పిలుచుదురు. కర్పూరపు చెట్టునుండియు కర్పూరమునుండియు గూడ తైలము తీయుదురు.

### కర్పూరములోని రకములు

1 పోతాస కర్పూరము 2 భీమసేన కర్పూరము 3 సితకర కర్పూరము 4 శంకరావాస కర్పూరము 5 పాంశుకర్పూరము 6 పింజ కర్పూరము 7 అబ్దసార కర్పూరము 8 హిమవాలుకా కర్పూరము 9 యూతికా కర్పూరము 10 హిమ కర్పూరము 11 తుషార కర్పూరము 12 శీతల కర్పూరము

13 పత్రికా కర్పూరము అని యింకను అనేకరకములుగలవు. ఈ భేదములేకాక కర్పూరచెట్టులోనుండి సారము లేక జిగురు తీయబడునప్పటి సారాసారములనుబట్టికూడ మొత్తము మీద మూడువిధములుగా నుండును.

కర్పూరపుచెట్టు మాని పై భాగమునుండి తీయబడు దానికి శిరోజమనంబడును. ఇదిమిక్కిలి తెలుపుగానుండి అద్దము వలె ప్రతిబింబించును. మ్రానుమధ్య భాగమునుపుట్టునది మధ్యమ మనబడును. ఇది శిరోజమంత తెలుపుగానుండక సామాన్యముగానుండును. కొంచెము గౌరవర్ణముగా నుండును. తక్కినభాగములందు తీసినది సాధారణముగానుండును. ఇదియే సాధారణముగా మనకుదొరకునది. ఇదిపొడిగానుండును. చెట్టు మానులోనుండి తీసినది కొంచెము పసుపురంగుగా నుండును.

కర్పూరము వేడిజేయును. రక్త, వాత, జీర్ణ, శ్వాస, చర్మవ్యాధులలో బాగుగా పనిచేయును. హారతి కర్పూరమును లోపలి కీయరాదు.

మోతాదు:— $\frac{3}{4}$ తులమువరకు.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B102 |
| పుస్తకం పేరు | ద్రవ్యజ్ఞానము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 111 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | iii ,104 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | VedaNathi. |
| పేజీలు విడదీసినది | VedaNathi. |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |